శ్రీః

# శ్రీకృష్ణ పరమాత్మ జాతకము




రచయిత:

"కవితా విశారద"

## టంకాల సత్యనారాయణ

జ్యోతిష పండిత పరిష్కృతము

ప్రథమ ముద్రణము

ప్రతులు : 1000

కాళయుక్తి - వైశాఖ—1978 మే

వెల : 2-50

ముద్రణ : భారతీ ప్రెస్, తెనాలి.

శ్రీ శివాయ గురవేనమః

"కార్తాంతికాభిజ్ఞ" ఆగమప్రవర్తక పండిత

# ప్రతాప కృష్ణమూర్తిశాస్త్రిసిద్ధాంతి

శ్రీ గణపతి జ్యోతిషాలయం, క్రొత్తపేట-తెనాలి.

శ్రీ మదాంధ్ర శివపురాణ, ఇందుమతీపరిణయ, వేంకటేశస్తుతిశతక
శ్రీ కాకాని మల్లేశ్వర సుప్రభాతాది గ్రంథకర్తలు.

శ్రీకృష్ణపరమాత్మ జాతక రచయిత లగు శ్రీయుత టంకాల సత్యనారాయణగారు శ్రీ మద్భాగవత సారామృతంబను గ్రంథమును సజ్జనబృందమున కందజేయ సంకల్పించుట మహాకవి లోకంబున కత్యంత కఠినతర విషయము. ఇతరపురాణములవలె నీభాగవతమును దెనిగించుట సులభముగాదు. అట్టి భాగవత సారంబును గ్రోడీకరించి తేటతెల్లంబగు "సీస" పద్యమూసలలో చిన్మయరూపం బగు సత్తు నమృతమయంబు జేసి శాస్త్రీయ, యతిప్రాస పదభావవిభావిత సత్కథా సుధారసంబును సుమనోవాసితంబగు నటుల లగించి బిగించి శ్రవణ పేయంబుగా భక్త జనుల కందింప గల్గుట ప్రశంసనీయము. వీరి పాండితీ మహిమకు దారాకాణము.

ఇందును శ్రీకృష్ణ పరమాత్మ జాతకచక్ర రచనమును నిర్వహింపబూనుట స్కంధత్రయవేత్తలగు జ్యోతిశ్శాస్త్రజ్ఞులకు గూడ లోతైన విషయము దానికై వీరెన్నియో గ్రంథముల బర్యాలోకనముజేసి సౌర చాంద్ర భగణంబు లాదిగ తత్కాలరవ్యాది గ్రహస్ఫుటంబుల ననన్య సామాన్యంబుగ బరిశోధించి, శ్రీకృష్ణపరమాత్మ మహావతార గుణగణ కథాకథితంబులగు ఫలితంబుల కనువగు నటుల రాశ్యంశారూఢ చక్రంబుల నేర్పరుచుకొనుట కొనియాడదగినది. వీరి చక్ర స్ఫుటీకరణ

నిమిత్తము రామావతార చక్రమును గూడ ప్రథమ సాక్ష్యముగ ప్రగాఢముగ విమర్శించుటయు కమనీయ హృదయామోదము గదా!

మఱియు నీ కావ్యమున సర్వవిషయముల వివిధోదాహరణముల జూపుట యీ రచయితకు సుగ్గుపాలతో గల్గిన చమత్కారము.

ఈ మహాకవి గ్రంథమునగల కఠిన పదంబులు సామాన్యులకు గూడ సుబోధకంబగు నటుల ప్రతిపదార్థంబులు వివరించియు, కొన్ని చోట్ల నుదాహరణముల జూపియు, ఉపదేశకర్తలగు గురువులకుగాని, పాఠకులగు సామాన్య జనంబులకును, బాలురకును గూడ అత్యంతోపయోగంబు లగు విషయంబులలో "నది, యిది" యని వెతుక నవసరపడకుండునటుల రచించుట కవిలోకమున కిది యొక నూతన మార్గము. ఈ విధముగ నీ గ్రంథము వెలువడుట గ్రంథకర్తగారి శ్రమకు మహోదాహరణము. జ్యోతిశ్శాస్త్ర విషయంబులు నిగూఢంబులైన నైననూ శ్రీకృష్ణ జాతక చక్రరూపంబున నీ శాస్త్రమును గూడ క్రోడీకరించి లోకమున కందించుట శ్రీకృష్ణ పరమాత్మ దర్శనము నందించుటయే కాగలదని నా నమ్మకము. ఇట్టి రచనలు రచించి వెలువరించిన ఈ మహాకవికి శ్రీకృష్ణపరమాత్మ సర్వాభీష్టంబుల నందజేయుగాక!

శ్రీ గణపతి జ్యోతిషాలయం
క్రొత్తపేట - తెనాలి
5-5-1977

ఇట్లు
బుధజన విధేయుఁడు
ప్రతాప కృష్ణమూర్తిశాస్త్రిసిద్ధాన్తి

# SRI BHUVANESWARI JYOTISHALAYAM, KAKINADA

Prof : Kandala Suryanarayana Murty
Spiritualist & Astrologer

శ్రీ టంకాల సత్యనారాయణగారు రచించినట్టి "శ్రీకృష్ణ పరమాత్మ జాతకము" అను మహాగ్రంథమును సంపూర్ణముగా చదివి అందలి పీయూషంబును మనసార గ్రోలు మహాభాగ్యము నాకు గల్గినది. వీరి యొక్క యోగదృష్టి తద్వారా పరిమళించు కాంతి యీ యుత్కృష్ట గ్రంథమున విస్తరించి విరాజిల్లుచున్నది.

ఈ మహాపురుషుడు భక్తియోగ, జ్ఞానయోగ, కర్మయోగంబు లనెడి మూడుశక్తుల సంపుటిత శక్తితో గ్రంథకర్తగా అద్వితీయమైన పరిశోధన గావించి ఉత్తమ కవిగా జ్యోతిషశాస్త్రవేత్తగా శ్రీకృష్ణపరమాత్మ కృపకు పాత్రులగుటవలననే యీ గ్రంథమును రచింపగలిగిరి. వీరు తమ జైత్ర యాత్రలో విజయమునందుదురనుటకు సంశయంబులేదు. తప్పక పరమేశ్వరుడు ఆ శక్తిని వీరికి అనుగ్రహించును.

ఈ గ్రంథము పండిత పామరులకు సైతము ముఖ్యపఠనీయ గ్రంథము. మన గ్రంథకర్తవంటి ఉత్తములు ఇట్టి గ్రంథముల నెన్నిటి నేని పరిశోధించి నూత్న విషయములు సంఘమున కందించవచ్చును.

కాని యిట్టి కార్యమునకు పోషణ యావశ్యకము. అందుచే ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడినట్టి వారియొక్క ఔదార్యము యెంతయు కొనియాడ దగియున్నది. అందరి వద్ద నుంచుకొన దగిన గృహపుస్తక భాండాగార గ్రంథమనుటకు ఎట్టి సందియము లేదు. భగవంతుడు వీరికి

ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చి ఈ మహోత్కృష్టమగు గ్రంథములు ఇంకా ఎన్నో ప్రజలకు అందించగలరను ఆశ సదా నాకు గలదు, యితర గ్రంథములను పోల్చిచూచినచో వీరురచించిన శ్రీకృష్ణ పరమాత్మయొక్క జాతకము మాత్రమే సరియైనదని శాస్త్రరీత్యా గోచరించుచున్నదనుటకు ఎట్టి సంశయములేదు.

సూర్యాపేట్ట
కాకినాడ
1-12-77

భవదీయుడు
కందాళ సూర్యనారాయణమూర్తి

---

## కృ త జ్ఞ త

ఈ గ్రంథమునకు తమ అమూల్యమైన అభిప్రాయముల నొసంగిన కాకినాడ వాస్తవ్యులు దైవజ్ఞులు బ్రహ్మశ్రీ కందాళ సూర్యనారాయణమూర్తిశాస్త్రిసిద్ధాంతిగారికిని, తెనాలి వాస్తవ్యులు కార్తాంతికులు బ్రహ్మశ్రీ ప్రతాప కృష్ణమూర్తిసిద్ధాంతి గారికిని నా నమోవాకములు. శ్రీమద్భాగవత సారామృత దశమస్కంధపూర్వ భాగప్రథమ బిందువున వివరించిన విధముగనే యీ గ్రంథము నను కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

ఇట్లు
– రచయిత

# కృతికర్త



## టంకాల సత్యనారాయణ

నివగాం:

జననము : ది. 30-౬-1908

ఛాయాచిత్రము ది. ౬-౩-1965

# వి జ్ఞ ప్తి

కార్తాంతిక విద్వత్కవి పండిత బుధజన విధేయుడ నగు నే నొనరించు విజ్ఞప్తి.

నేను "శ్రీ మద్భాగవత సారామృతము" అను గ్రంథము రచించుచు శ్రీకృష్ణ పరమాత్మ జనన ఘట్టము రాగా ఆ ఘట్టమున శ్రీకృష్ణ పరమాత్మ జాతకమును కల్పించి చేర్చవలెనని యొక సంకల్పము కలిగెను.

ఏలయనః రామాయణమునందు శ్రీరాముని జాతక మున్నట్లు భాగవతమున శ్రీకృష్ణుని జాతక మేలలేదని బాల్యమున నుండి నా మనమున నుండెడిది.

అందుచే నే రచించిన భాగవతమున శ్రీకృష్ణ పరమాత్మ జాతక మేర్పఱచుటకు సంకల్పించుకొని అందుకు కావలసిన అనేక గ్రంథములను పరిశోధించి జాతకచక్ర మేర్పఱచితిని.

ఇందుకు నా సాహసమునకు మన్నించి నా కృషి మొదలగు విషయములు యీ "శ్రీకృష్ణ పరమాత్మ జాతకము"ను చదువుచు నా శ్రమను శాస్త్రీయమగు కృషిగా గుర్తించెదరని వినయ విధేయుడనై విజ్ఞప్తి చేయుచున్నాను.

ఇట్లు
— రచయిత

# శుద్ధపత్రము

## శ్రీకృష్ణ పరమాత్మ జాతకము

| పుట | పంక్తి | అక్షరసంఖ్య | తీసివేయవలసినవి | చేర్చవలసినది |
|---|---|---|---|---|
| 5 | 21 | 20 | అ | మ |
| 12 | 1 | 12 | స్తే | స్థే |
| 29 | 21 | 10 | ల | ఱ |
| 48 | 12 | 10 | 356-1/4 | 365-1/4 |
| 48 | 13 | 10 | 356-97/400 | 365-97/400 |
| 48 | 22 | 23 | చే | చే |
| 54 | 22 | 8,9,10 | చంద్రత | చాంద్రిశ |
| 54 | 23 | 14,15,16 | షాశనీ | షాఽశనో |



ఓం

శ్రీరస్తు

శుభమస్తు

అవిఘ్నమస్తు

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీకృష్ణ పరమాత్మ జాతకము

కల్పితము

స్తోత్రములు

"రక్తాంబుజ రుచిం దేవం సర్వారంభేషు సర్వదా।
ప్రణమంతి స్వయం దేవా స్తం న్నమామి గజాననమ్". ॥సర్వా॥చిం॥

"వాగ్విభూతిప్రదా దేవీ యా శ్వేతాంబురుహాస్థితా।
కర్పూర ధవళాకారా స్వయం నృత్యతు వాచి మే."॥సర్వా॥చిం.

"నమ స్సూర్యాయ చంద్రాయ మంగళాయ బుధాయ చ।
గురు శుక్ర శని భ్యశ్చ రాహవే కేతవే నమః॥"

"వసుదేవసుతం దేవం కంస చాణూర మర్దనమ్।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్॥"

* శ్రీకృష్ణ పరమాత్మ జాతక ఫలశ్రుతి *

ఉ॥ మానవు లాత్మశుద్ధిగఁ గ్ర
మంబుగఁ గృష్ణుని జాతకంబు స
మ్మానితులై పఠింప విన
మారమణుండగు దేవకీ లస

తూనుఁడు ప్రోచు సంతతము
సూర్య శశాంక కుజాదు లెన్నఁడున్
హాని యొనర్పఁ గోర రిల
హాయిగ నుంచెద రెల్లవేళలన్ ॥

రచయిత టంకాల సత్యనారాయణ, నివగాం, శ్రీకాకుళం జిల్లా

ఈతఁడు శ్రీ మద్భాగవత సారామృత సీసకావ్యమను పేరిట కలి 5067 శాలివాహన 1888 హూణ 1966 శకాబ్దములకు సంబంధించిన శ్రీమత్పరాభవనామ సంవత్సరారంభమున లిఖించుటకుఁ బ్రారంభించి రచించుచు శ్రీకృష్ణపరమాత్మ జనన కథనఘట్టము రాగా నా మహాత్ముని జాతకచక్ర మేర్పఱచవలెనని యొక సంకల్పము పొందెను.

దానిని గుఱించి శ్రీకృష్ణుని జననచరిత్రములు గల పురాణములు నితరగ్రంథములు సాధ్యమైనంతవఱకుఁ బరిశీలించెను.

శ్రీ మద్భాగవత మూలము దశమస్కంధ పూర్వభాగ తృతీయాధ్యాయమున

"అథ సర్వగుణోపేతః కాలః పరమశోభనః ।
యర్హ్యేవాజన జన్మర్క్షం శాంతర్క్ష గ్రహతారకమ్॥" (1)
నిశీథే తమ ఉద్భూతే జాయమానే జనార్దనే ।
దేవక్యాం దేవరూపిణ్యాం విష్ణుః సర్వగుహాశయః॥" (8)

భావార్థదీపిక యను శ్రీధరవ్యాఖ్య

"తృతీయే నిజరూపేణ సంభూతస్తు హరి స్స్వయం ।పితృభ్యాం సంస్తుతో నీతః పితా భీతేన గోకులమ్" అథేతి మంగళార్థః యర్హి యదా సర్వగుణోపేతః। కాలోబభూవ తదా దేవక్యాం విష్ణు రావిరాసీదిత్యన్వయ

శ్లోకేనాన్వయః పరమశోభన త్వమేవాహా యర్షీత్యాదినా అజనాత్ నారాయణాత్ జన్మయస్య ప్రజాపతే స్తస్య ఋక్షం రోహిణీ నక్షత్రం కథం భూతం శాంతాని ఋక్షా ణ్యశ్వినాద్య దీని గ్రహా స్సూర్యా దయః తారకాశ్చ యస్మిన్‌తత్ ।"

అని కలదు. అజన = పుట్టువులేని విష్ణువునకు జన్మః = జనించిన ప్రజాపతి (బ్రహ్మ) దేవతాకమైన నక్షత్రము రోహిణీనక్షత్రము.

ఈ సందర్భమున పోతన భాగవతమందు

కం॥ సుతుఁ గనె దేవకి నడురే
యతి శుభగతిఁ దారలును గ్ర • హంబులు సుండన్
దితిసుత నిరాకరిష్ణుం
శ్రిత వదనాలంకరిష్ణు • జిష్ణున్ విష్ణున్॥ అని కలదు.

శ్రీ శతఘంటం వెంకట రంగశాస్త్రిగారి వచన భాగవతమున "గ్రహనక్షత్ర రాశికంబులు సౌమ్యంబులై వెలుంగ రోహిణీ నక్షత్రంబున సంతసన దంతురంబైన మహానిశీథమున" అని కలదు.

ఇందు భాగవత మూలము శ్రీ॥ శ॥ వెం॥ రం॥ శా॥ వ॥ భాగవతముఁబట్టి రోహిణీనక్షత్రము నడురేయి యని మాత్రము కలదు. పో॥ భా॥ మున "నడురేయి గ్రహనక్షత్రములు శుభగతి" అని మాత్రము కలదు. మరేవియు రూఢిగ లేవు.

ఇంకను బరిశీలింపగ హరివంశ మూలమునందు పూర్వభాగ౫౨ అధ్యాయమున "యోగమాయాం ప్రతివిష్ణూక్తిః" అను శీర్షికలో

శ్లో॥ తతోహం సంభవిష్యామి దేవకీ జఠరే శుభే ।
గర్భే త్వయా యశోదాయా గంతివ్య మవలంబితమ్ ॥
"ప్రావృట్కాలే చ నభసి కృష్ణాష్టమ్యామహం నిశి
ఉత్పత్స్యామి నవమ్యాం చ ప్రసూతిం త్వ మవాప్స్యసి"

మఱియు ౫౩ వ అధ్యాయమున

శ్లో॥ దేవకీ చ యశోదా చ సుషువాతే సమం తదా ।
యా మేవ రజనీం కన్యాం యశోదా దేవ్యజాయత ॥
అష్టమ్యాం శ్రావణే మాసి కృష్ణపక్షే మహాతిథౌ ।
రోహిణ్యా మర్ధరాత్రే చ సుధాంశా వుదయోన్ముఖే ॥
దేవక్యజనయ ద్విష్ణుం యశోదా తా న్తు కన్యకాం ।
* ముహూర్తేఽభిజితి ప్రాప్తే హ్యర్ధరాత్రే శుభావహే ॥

అని కలదు. ఇందునుబట్టి "వర్ష ఋతువు శ్రావణ కృష్ణాష్టమీ రోహిణీ నక్షత్రము అర్ధరాత్రి చంద్రోదయ సమయము అభిజిత్తు ముహూర్తములు" అనియున్నది.

ఆంధ్రీకరింపబడిన యెఱ్ఱాప్రగడ హరివంశ పూర్వభాగ పంచమాశ్వాసమున "దేవకీగర్భమునుండి శ్రీకృష్ణుఁ డుద్భవించుట" అను శీర్షికలో 116 వ పద్యము.

"మహిత శ్రావణ మేచకాష్టమి నిశా
మధ్యంబునం బ్రస్ఫుర
ద్గ్రహముల్ స్వోచ్చగృహంబులం దైదు వి
భ్రాజిల్లఁ బుత్త్రిన్ యదూ
ద్వహుఁ బుణ్యాంగన కాంచె విశ్వజగదా
ధారోదయున్ ధర్మ ని
ర్వహణారంభ ధురీణు నిత్యవిబుధా
వర్ధిష్ణునిం గృష్ణునిన్"

అని కలదు. దీనినిబట్టి శ్రావణమాసము, కృష్ణపక్షము నడురేయి అయిదు గ్రహములు స్వోచ్చ అని గోచరించుచున్నది.

మేచకము = నలుపు black ధీవర్గ శ్లో॥ 153 కావున మేచ కాష్టమి అనుట కృష్ణపక్షాష్టమి.

ఆంధ్రప్రదేశ సాహిత్య యకాడమీవారు ప్రచురించిన పోతన భాగవతమునందు శ్రీకృష్ణావతార ఘట్టము 312 వ పుట అధస్సూచికలో "క" కల్లూరివారి ప్రతిలోని

తరళ :- అలర శ్రావణ బహుళాష్టమి విశ్వసృ డ్వధితారకన్

చెలువమగు చంద్రోదయంబున శ్రీవిభుండు జనించినన్॥

అని కలదు. దీనినిబట్టి శ్రావణ బహుళాష్టమీ రోహిణీ నక్షత్రము చంద్రోదయసమయమని తెలుపబడినది. ఈ విషయములు పై నుదహరించిన వానిలోఁ గలవు.

విశ్వసృడ్వధితారక :- బ్రహ్మయొక్క దేవతాకమైన నక్షత్రము రోహిణీ నక్షత్రము.

గార్గ్యము :- గీ॥ అర్ధరాత్రంబునం దిందుఁ • డభ్యుదయము
సెందినను గనుచీఁకటి • చెలఁగ హర్ష
యోగ బుధవార రోహిణీ • యుక్తమైన
భాద్రకృష్ణాష్టమిన్ వృష • భంబునందు॥

అని కలదు. కాని గర్గుఁడు "భాద్రకృష్ణాష్టమి" అని వ్రాసినది కూడ శ్రావణబహుళ పక్షమే యగును. దాని నిర్వచనము దిగువ వివరింపబడి యున్నది. కావున వీని నన్నింటినిబట్టి వర్షఋతువు శ్రావణ బహుళాష్టమీ రోహిణినక్షత్రము స్వోచ్చస్థ చంద్రోదయసమయము అర్ధరాత్రి వృషభలగ్నము ఐదుగ్రహములకు స్వోచ్చ అని గ్రంథములరీత్యా విమర్శింపగా స్పష్టమగుచున్నది. రోహిణీ నక్షత్రము వృషభ రాశికి సంబంధము - రోహిణీ నక్షత్రమందుఁ జంద్రుఁ డుండుటయే

రోహిణీ నక్షత్రమగును. వృషభరాశి చంద్రునకు స్వోచ్చస్థానమై యున్నది. చంద్రోదయసమయ మగుట వృషభలగ్నమైనది. కావున వృషభలగ్నమని గర్గుఁడు తప్ప మరెవరు వ్రాయకపోయినను యితరులు వ్రాసిన పై విషయములనుబట్టి వృషభలగ్నమే యైయున్నది.

శ్రీవావిళ్ళవారి పోతన భాగవత పీఠికలో "మాసము శ్రావణమని పక్షము కృష్ణపక్షమని నక్షత్రము రోహిణీ నక్షత్రమని లగ్నము వృషభ లగ్నమని" మాత్రము తెలిపి "కలియుగపూర్వము 125 యేండ్లనాఁటి శ్రీముఖనామ సంవత్సరమున శ్రీకృష్ణపరమాత్మ జననము" అని కలదు, కాని జాతకమునకుఁ బ్రధానముగఁ గావలసిన గ్రహచక్రమును దెలుపలేదు.

కావున సౌరమాస మేదై యుండును? నక్షత్రపాద మేదై యుండును? లగ్న మెంతభుక్తియై యుండును? అనునవి యే గ్రంథములయందును విపరింపఁ బడియుండనందున శ్రావణ బహుళాష్టమీ రోహిణీ నక్షత్రమున నర్ధరాత్రి ప్రాంతమున వృషభలగ్నము నిచ్చునట్టి సౌరమాస మేదై యుండును? ఏబహుళాష్టమీ దినమునందైనను నా ప్రాంత అర్ధరాత్రి నాటి యొక ఘడియలోపల సిద్ధించును గదా! యట్టిసమయమున వృషభ లగ్నమందు శ్రేష్ఠమైన నవాంశముకూడ సరిపడవలెను. శ్రీరాముని జాతకమున శ్రేష్ఠమైన నవాంశమే కలదు. కావున నవి పరిశీలించినచో సౌరమాస మేదగునో యందెంతభుక్తి యగునో బోధపడును గదా! యని యా విషయములకై మొదట పరిశీలింపఁబడెను.

వృషభ నాల్గవ నవాంశమునుండి యేడవ నవాంశమువఱకు మాత్రము రోహిణీ నక్షత్రపాదము అగును. ఆ రోహిణీనక్షత్ర ద్వితీయపాదము వర్గోత్తమాంశమగు పంచమ నవాంశమై శ్రేష్ఠమై వృషభలగ్న మస్తక సమయమైనదగుట దాని నాధారముగఁ దీసికొని

యియ్యది యర్ధరాత్రము దాటి యొకఘడియలోపల వచ్చునట్లు రవి యే సౌరమాసమం దెన్నవ దినమునకు సరిపడునని శోధింపగా రవి సింహమున కేగిన మూడవదినమునం దర్ధరాత్రిదాటి కొద్దిసేపటిలో వృషభ వర్గోత్తమాంశమగు నైదవ నవాంశము రోహిణీనక్షత్ర ద్వితీయపాదమున జంద్రుడు స్వోచ్చస్థుడై యుండ లగ్న ముదయించి మస్తక సమయమునకు రాగా అది నిశ్చయింపబడెను.

వర్గోత్తమాంశ మనగ లగ్నమేదగునో యారాశ్యాధిప నవాంశము వర్గోత్తమాంశ మగును. అనగ జన్మలగ్న మేదియో యంశలగ్నము కూడ నదియే యగుట. ఇయ్యది మేషమునకు ప్రథమ నవాంశమును వృషభమున పంచమ నవాంశమును మిధునమున నవమ నవాంశమును నిట్లు ప్రతిమూడు రాసులకు ప్రథమ పంచమ నవమ నవాంశము లుండును, కావున చర స్థిర ద్విస్వభావ రాసులకు ప్రథమ పంచమ నవమ నవాంశములు క్రమముగ వర్గోత్తమాంశము లగును. అట్లు వృషభ రాశికి నైదవ నవాంశము రాశ్యధిప శుక్రనవాంశ మగుటను వర్గోత్తమాంశమైనది. ఇయ్యది రోహిణీనక్షత్ర ద్వితీయ పాదము కావుననందు జంద్రుడుండుటవలన జంద్రునకు వర్గోత్తమాంశమైనది.

* వృషభలగ్న వర్గోత్తమాంశ ఫలము *

"ఉత్పన్న ప్రతిజ్ఞా భోక్తా సంగ్రహీ విగతప్రజః"॥జ్యో॥మ॥మా॥
"శుభం వర్గోత్తమే జన్మ వేశిస్థానే చ సద్గ్రహే"॥ సర్వా॥చిం॥

వేశిస్థానము:- రవికి రెండవరాశి-అచ్చట శుభగ్రహము లుండవలెను.

నిశీథము=నడురేయి కదా! ఐతే సరిగా నడురేయియే కాదు. ముహూర్తకాలము రెండు ఘడియలు కావున నర్ధరాత్రికి నొక ఘడియ చొప్పున వెనుకముందులు కూడ నిశీథమే యగును. అందువలన నర్ధ-

రాత్రి దాఁటి సుమారొక యరఘడియ కాలము నిశీథమునకే వర్తించును. ఇది మస్తక సమయము.

శ్లో॥ రాత్ర్యర్ధా ద్యదళా త్పరం యది భవే జ్జాతో దివానాద్యాత్మకే।
కాలే స్యా న్నృపతి ర్జితారి రనిశం స్వాచార విద్యాన్వితః॥

ఉత్తరకాలామృతము శ్లో॥ 70

ఆనాఁడు క్రీస్తుశకము లేకపోయినను నిప్పటి క్రీస్తుశకమానమును బట్టి రవి సింహగత తృతీయ దినము ఆగష్టునెల తే 18,19 లలోనగును.

అట్టి రవి సింహగత తృతీయదినమున అహఃప్రమాణము ఘ ౩౧-౩౬ వి ఘటికలును రాత్రి ఘ ౨౮-౨౪ వి ఘటికలును అయి యుండున, అర్ధరాత్రి సూర్యోదయాది ఘ ౪౫-౪౮ వి ఘటికలగును. వృషభలగ్న మాదినమున సూర్యోదయాది ఘ ౪౩-౩౬ వి ఘటికలనుండి ఘ ౪౮-౩౫ విఘటికలవరకు నుండును. నాల్గవ నవాంశము సరిగ నర్ధరాత్రివఱకు మాత్రముండును. పిమ్మట యైదవ నవాంశము ఘ ౦-౩౩-౧౩ లిప్తలవరకు నుండును. కావున నట్టి యైదవ నవాంశము మధ్యరాత్రి దాఁటి అరఘడియలో నుండును.

అట్లగుట వృషభలగ్నభుక్తి ఘ ౨-౩౫ శేషము ఘ ౨-౨౪ విఘటికలు సమయమున శ్రీకృష్ణ పరమాత్మ జననమనియు నయ్యది సూర్యోదయాది ఘ ౪౬-౧౦ విఘటికలును సూర్యాస్తమయాది ఘ ౧౪-౩౫ విఘటికలని యొక నిర్ణయమునకు వచ్చెను.

ఈ నిర్ణయము ప్రకారము నిశీథిని లగ్నము వర్గోత్తమాంశము రోహిణీ నక్షత్ర ద్వితీయపాదము మస్తక సమయములై యున్నవి.

"ముహూర్తేఽభిజితి ప్రాప్తే హ్యర్ధరాత్ర సుఖావహే" అని పైని నాల్గవపుటలోఁ దెలుపఁబడిన ప్రకార మర్ధరాత్రి వర్తించియున్నది.

మఱియు లగ్న అంశలగ్న చంద్రలగ్నము లొకే వృషభవర్గోత్త మాంశము లైనవి.

రోహిణీ నక్షత్ర ద్వితీయపాదమునం దర్ధభాగము భుక్తియై రెండున్నర పాదములు శేషమున్నందున జన్మకాల చంద్రమహాదశా భుక్తి సం 3 నె 9 లు గను శేషము సం 6 నె 3 లు గను స్థిరపఱచి స్వోచ్చస్థుఁడైన చంద్రుని వృషభమున (15) పదునైదవ భాగలో నుంచఁబడెను.

రవి సింహగత తృతీయ దినము మఘానక్షత్ర ప్రథమపాదము. అయ్యది సింహరాశి ప్రథమ నవాంశమైనందున రవికి స్వోచ్చస్థానమైన మేషకుజ నవాంశమైనది. రవికి సింహరాశిలో నిరువదిభాగలవరకు మూల త్రికోణము కావున మూడవ భాగలో నుండుట మూల త్రికోణముకూడ వర్తించినందున రవి సింహగత తృతీయ దినము పలువిధ సుయోగ ములుగ నుండుటచే రవిని సింహరాశి తృతీయభాగలో నుంచఁబడినది.

కావున నిప్పటికి వర్షఋతువు సింహముతోఁ గూడుకొనిన శ్రావణ కృష్ణపక్షాష్టమీ దినమునం దర్ధరాత్రిదాఁటి అరఘడియలో స్వోచ్చస్థుఁడైన చంద్రుఁ డుదయించుచుండగా రోహిణీనక్షత్ర ద్వితీయచరణ వృషభలగ్న వర్గోత్తమాంశము రవి మఘానక్షత్ర ప్రథమ చరణమున నుండగా శ్రీకృష్ణావతరణము జరిగె ననునది నిశ్చయముగా సరిపడుచున్నది.

గార్గ్యమున భాద్రకృష్ణాష్టమీ యనునదికూడ శ్రావణ బహుళాష్ట మియే యగునని దాని నిర్వచనము దిగువ వివరింపఁబడియున్నదని పైనఁ జెప్పఁబడియున్నది. అదెట్లన దక్షిణహిందూస్థానమున నెలకు మొదట శుక్లపక్షమును పిమ్మట కృష్ణపక్షమును వచ్చుచుండును.

"పక్షౌ పూర్వాపరౌ శుక్లకృష్ణౌ మాసస్తు తావుభౌ"

ఉత్తర హిందూస్థాన మందట్లు కాదు. వారికి మొదట కృష్ణపక్షమును బిమ్మట శుక్లపక్షమును వచ్చుచుండును. కాని వత్సరారంభమనగ "ఉగాదిపండుగ" అందఱికిని నొకేదినముగ నుండి వత్సరారంభ వారాధిపతియే యా వత్సరాధిపతి యగును. అదెట్లన వత్సరారంభమున చైత్రశుద్ధ పక్షముగను వత్సరాంతమున చైత్రబహుళ పక్షముగను నుండి నూతనవత్సరాది దిన మొకే రోజగును. ఉత్కళసిద్ధాంతమునకూడ నిట్లే యున్నది.

ఇట్లు చైత్రశుద్ధ ముభయప్రాంతముల కొకేపక్షముగ నుండి దక్షిణహిందూస్థాన చాంద్రమానులకు చైత్రబహుళము వచ్చునరికి దానినే ఔత్తరాహులును నుత్కళులును వైశాఖ బహుళపక్ష మందురు. కావున నావిధముగ దక్షిణాది చాంద్రమానుల శ్రావణబహుళ పక్షమునకు నౌత్తరాహులు నుత్కళులు భాద్రపద బహుళపక్ష మందురు.

గర్గుఁ డుత్తర భారత వాసి యగుటచే నా ప్రాంతమునందలి సిద్ధాంతము రీత్యా యాతఁడు "భాద్రకృష్ణాష్టమి" అని వ్రాసిన దక్షిణ హిందూస్థాన చాంద్రమానమురీత్యా శ్రావణ బహుళమే యైయున్నది

ఇవ్విధముగ రవి సింహస్థితియు చంద్రుఁడు వృషభస్థితియుఁగా ! తక్కిన సప్తగ్రహము లేయే స్థానములయందుండినచోఁ బైనవివరించిన గ్రంథముల యభిప్రాయము గ్రహ సంచారశాస్త్రము శ్రీకృష్ణపరమాత్మ జీవితచరిత్ర ఫలితములు సరియగునో యట్లు జాతకచక్ర మేర్పఱచుటకు గ్రహస్థితుల గురించి పూర్వులు వ్రాసిన శుభ సామ్య హర్ష యోగముల నాధారములుగాఁ జేసికొని స్వతంత్రించి కనుఁగొనిన విషయములు వివరింపఁ బడుచున్నవి.

భావార్థదీపిక యను శ్రీధరవ్యాఖ్యలో "శాంతాని ఋక్షాణ్యశ్విన్యాదీని గ్రహాస్సూర్యాదయః" అని, ఆంగ్రీకరింపఁబడిన యెఱ్ఱాప్రగడ "హరి వంశము"నం దైదుగ్రహములు నోచ్చములని, యున్నది.

రవి సింహమందుండుట నది నోచ్చముకాదు. చంద్రుఁడు నోచ్చ స్థానముననే యున్నాఁడు. శుక్రునకు మీనము నోచ్చ. ఆ గ్రహము రవికి వెనుక 48 భాగలు, ముందు 48 భాగలులోనే సంచరించుచుండును. 48 భాగలకు దాటి సంచరించఁడు. కావున రవికి శుక్రుఁడు 1,2 యిండ్లు వెనుక ముందులలోగానీ రవియున్నయింటిలోగాని యుండును. ఇందున్న రవికి మీనము చాలదూరములో నున్నందున శుక్రుఁ డానమయమందు నోచ్చమగు మీనములో నుండవలనుపడదు.

ఈ శుక్రుడేస్థానమం దుంచఁబడెనో ముసుముందు వ్రాయఁబడును. కావునఁ దక్కు కుజ,బుధ,గురు,శనులను నోచ్చములయం దుంచినచోఁ జంద్రునితో నైదుగ్రహములకు నోచ్చమై యాంధ్రహరివంశమునందు దెలిపినటుల నుండునుగదా! యని నిర్ణయించివేసినచో శ్రమ మే ముండును! అట్లొనర్చి రవికి శుక్రుఁడు మూడవయింట నుండుట గూడఁ గలదని శుక్రుని తులయందుంచివేసినచో సప్తగ్రహ ములలో నైదుగ్రహములకు నోచ్చములున్ను,రెండుగ్రహములకు స్వక్షేత్రములును వర్తించును. కాని యెంతవానికైనను సప్తగ్రహము లన్నియు నుచ్చ స్వక్షేత్రములు పట్టవు. శ్రీరామచంద్రుని జాతకమునందును గ్రహము లన్నిటికి నోచ్చ స్వక్షేత్రములు పట్టలేదు.

శ్రీమద్రామాయణము బాలకాండము (అష్టాదశ (18) సర్గః)

"తతో యజ్ఞే సమాప్తే తు ఋతూనాం షట్ సమత్యయుః
తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ॥ 8

నక్షత్రేఽదితి దైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు
గ్రహేషు కర్కాటే లగ్నే వాక్పతా విన్దునాసహ" 9

నక్షత్రేఽదితి దైవత్యే:- పునర్వసు నక్షత్రమని వ్యాఖ్యానము.
భాస్కర రామాయణము బాలకాండము 157 పద్యము

సీ॥ "వెలయఁ జంద్రెండవ • నెలయందుఁ జైత్ర పు
నర్వసు బుధ శుద్ధ • నవమినాఁడు
పంచ గ్రహంబులు • పరగ నుచ్చస్థాన
గతులుగా గురు సుధా • కరులు గూడ
కర్కాటకాఖ్య ల • గ్నమునందుఁ గౌసల్య
హరి కర్ధమగు రాము • నమరఁ గనియె"

చంపూరామాయణము

"ఉచ్ఛస్థే గ్రహపంచకే సురగురౌ స్వేందౌ నవమ్యాం తిథౌ।
లగ్నే కర్కటకే పునర్వసుయుతే మేషం గతే పూషణి
నిర్దగ్ధుం నిఖిలాః పలాశసమిధో మేధ్యాదయోధ్యారణే
రావిర్భూత మభూతపూర్వ మపరం యత్కించి దేకంమహః।

మంథర రామాయణము బాలకాండము

కం॥ క్రతువు పరిపూర్తి యగుడున్
ఋతుషట్కం బరుగఁ బదియు • రెండవ నెలలో
క్షితిఁ జైత్రశుద్ధ నవమి న
దితి తారను రవియు నడిమి • దివిని వెలుంగన్॥ 490

రవి అభిజిత్తు

కం॥ పరకర్కాట లగ్నంబున
సురగురు డుదయించుచుండ • సోమునితోడన్

ధరణి ముఖగ్రహ పంచక
మరుదుగ నోఁచ్చ స్థలంబు • లందు వెలుంగన్॥ 500

రవి అశ్విని 3 వ పాదము.

అని యాయారామాయణములందు గలదు. వాని ననుసరించి స్వీయరచన శ్రీరామాయణ సారామృత మను శ్రీ దాశరథీ మకుట కందశతకమున

కం॥ "గురు కుజ రవి శని శుక్రు ల
మర నుచ్చం జంద్రుఁ డాత్మ • మందిర మొందన్
వర కర్కాటమున సుర సుర
చిర నుత లొప్పగ జనించు • శ్రీ దాశరథీ!" 31

అని వ్రాయబడినది.

ఏ చైత్రశుద్ధ నవమికిఁ బూర్వ సంవత్సరమం దధికమాసము వచ్చునో యానవమికి రవి మేషమున నుండును. కావున శ్రీరామునికి మేషమందు రవి యుండుటనుబట్టి శ్రీరాముఁడు జన్మించిన చైత్రమునకు ముందుగడచిన సంవత్సరమున నధికమాస ముండియుండె నని గుర్తించి నచో శ్రీరాముని జనన సమయమునకు రవి మేషమునకు రాక మీనముననే యుండునను ప్రశ్న యుదయించదు.

ఇది గాక శ్రీరాముఁడు జన్మించిన చైత్రమునకుఁ దొలినెల యధికమైనను శ్రీరామనవమికి రవి మేషమునకు వచ్చును గాని తొలి నెల యధికమైనచో రాముని జాతకమునందు నిజచైత్రమని యుండి యుండును. అట్లు లేదుగనుకఁ దొలినెల యధికచైత్రము కాదని తొలి సంవత్సరముననే యధికమాస ముండియుండె నని రూఢిగఁ గనిపించు చున్నది.

గురుఁడు కర్కాటమని గ్రంథములు చెప్పుచున్నందున నుచ్చస్థుఁడై యున్నాడు. చంద్రుఁ డాకర్కాటముననే యున్నందున నుచ్చకు రాడు. బుధునకు కన్యారాశి యుచ్చ. అది రవికిఁ జాలదూరమున నున్నందున రవికి బుధుడు 28 భాగలుదాఁటి యుండనందున బుధునకు నుచ్చస్థితిరాదు. కావున కుజ, శుక్ర, శనుల నుచ్చలనుంచిననే తప్ప గ్రంథములలో వ్రాసినప్రకారము "స్వోచ్చ సంస్థేషు పంచసు" "పంచ గ్రహంబులు పరగ నుచ్చస్థాన గతులుగా" "ఉచ్చస్థే గ్రహపంచకే" అనునవి సరిపడవు. రవి మీనమైనచో నాల్గుగ్రహములకే యుచ్చమగును. కావున నానాఁడు రవి మేషమునకు వచ్చెనని యంగీకరించక తప్పదు.

ఇంకొక్కవిషయము పుత్రకామేష్టి చేసిన పండ్రెండవనెలను రామాదులు జనించిరని రామాయణములు చెప్పుచున్నవి. పండ్రెండు నెలలొక సంవత్సరముకదా! సంవత్సరమని గ్రంథములు తెలుపక పండ్రెండు నెలలని అన్ని రామాయణము లొకేవిధముగ హెచ్చరించుటకుఁ గారణమేమైయుండును? పుత్రకామేష్టి జరిపిన పైని యా సంవత్సరమున నధికమాసముండుటను బట్టి సంవత్సరమని వ్రాసినచో చైత్రమాసములో జననమై నందున గత చైత్రమునఁ గామేష్టి జరిగినదని వర్తించును. అట్లగుట నధికమాసముచేర్చి పదమూడునెలలకు వర్తించును పండ్రెండునెలలని వ్రాయుటనుబట్టి వైశాఖమాసమునఁ గామేష్టి జరిగినచో నధికమాసముకలిపి రామాదులు జనించిన చైత్రమునకుఁ బండ్రెండు నెలలగును. కావున వైశాఖమాసముననే కామేష్టియును మఱుసటి సంవత్సరచైత్రములో జన్మించుటయును జరిగినదనియు నామధ్య నధికమాసమొకటి కలదనియందువలన బండ్రెండునెలలనివ్రాయుటకుఁ గారణమనియు నధికమాస ముండుటచే రవికి మేషస్థితి కలిగినదనియు నిన్నిటికి సమ

స్వయముగ నున్నది. ఇదిగాక అధికమాస మేసంవత్సరమున నుండునో యాసంవత్సర చైత్రము చాలభాగము మీనచైత్రమగును. పుత్రకామేష్టి మీనచైత్రమునఁ జేయరాదు. కావున వైశాఖముననే జరిగినదని ధ్రువముగ గనిపించుచున్నది.

శ్లో॥ మీనచైత్రో ధనుః పుష్యో మిథునాషాఢకోఽపిచ।
కన్యా భాద్రపదో యుక్తో శూన్య మాసాః ప్రకీర్తితాః॥

చంపూరామాయణ కర్తయగు భోజమహారాజు జ్యోతిష పండితుఁడు. ఆయన "ఉచ్చస్థే గ్రహపంచకే" అని వ్రాయుచు "మేషం గతే పూషణి" అని నొక్కి వక్కాణించిరి. "రవి మేషమునకు వచ్చెనా ? మీనమందుండెనా ?" అని ముందుకాలమున విమర్శించుటకు స్థానము లేకుండ "ఉచ్చస్థే గ్రహపంచకే" అనుటలో నంతర్భూతముగ రవి చేరియున్నప్పటికి "మేషం గతే పూషణి" అని మరల వ్యక్తీకరించుటకుఁ గారణమని భావింపబడుచున్నది. పైని వివరించిన ప్రకార మధికమాస మున్నదని గుర్తించి యావిధముగ వ్రాసియుందురని కనిపించుచున్నది.

బుధునకు ఉచ్చయు స్వక్షేత్రము పట్టలేదు. కావున గ్రహము లన్నిటికి స్వోచ్చ స్వక్షేత్రము లెన్నడు పట్టవు.

అదేవిధముగ శ్రీకృష్ణుని జాతకమునను కూడా గ్రహములన్నిఁటికి స్వోచ్చ స్వక్షేత్రములు పట్టవు గదా ! యతని జన్మకాలమునకు గ్రహస్థితు లెట్లుండునని దీర్ఘముగ యోచించి బుధుఁడు రవికి వెనుక 28 భాగలలోపల ముందు 28 భాగలలోపలనే సంచరించుటనుబట్టి బుధుడు రవితోగాని రవికి నొకరాశి వెనుక ముందులలోగాని సంచరించును. కావున రవికి నొకరాశి ముందుదగు కన్యారాశిలో బుధునినుంచినచో స్వక్షేత్రము మూలత్రికోణము స్వోచ్చలగు క్షేత్రమనియు నదిచాల యోగ్య

మైనదనియు నవతారపురుషున కది యోగదాయకమైనదనియు బుధుఁడు కన్యలోనేయుండి యుండుననియు నిశ్చయించి రవికి 28 భాగలుదాఁటి యుండుటకు వలనుబడదు కావున కన్యారాశిలో ప్రథమభాగలో ప్రథమ నవాంశములో బుధుని నుంచబడెను. కన్యారాశి ప్రథమభాగనుండి స్వోచ్ఛ కావున బుధునకు స్వోచ్ఛస్థితియు మకర శని నవాంశమును కలిగినది.

ఇక శని స్వోచ్ఛమగు తులయందు విధిగానుండెనని యట్లుంచఁబడెను. మహాత్ములు జనించునప్పుడు గ్రహములుండు రాశిఫలితములు కూడ శుభప్రదములై యుండవలెను.

ధటస్థితే భానుసుతేసు వృష్టి స్సస్యాభివృద్ధి స్సుఖినోనరాశ్చ"
అని శని తులారాశిస్థిత ఫలము చెప్పఁబడియున్నది. అందువలనను కూడ శనిని తులయందుంచుట యత్యంత మొప్పిదమైయున్నది.

ధటము=తులారాశి

ఇఁక నీతఁ డీయుద్దేశ్యము పొందిననాఁటికి రాహువు మేషమువందుండుటయును రాహువునకు మేషరాశస్థితి లగ్నాత్ వ్యయస్థితికూడ యోగ్యమైనదేయని దైవికముగఁ దోచినవిధముగ రాహువు మేషస్థితియే యైయుండెనని యటుల స్థిరపఱుపఁబడెను.

ఇకపైని గురుని విష్టువచ్చినచోట నుంచినచో గ్రహసంచార గణితశాస్త్రము ననుసరించి యామహాత్ముని జననకాలమునకు సరిపడవలెనుగదా! యని యందుకు సంబంధించిన గ్రంథములను బరిశీలించి యాయాశాస్త్రముల ననుసరించి కలియుగమునకు బూర్వము నూరుసంవత్సరముల కావలవరకు పరిశీలించి లెక్కించగా శనితులయందు రాహువు మేషమునందు నుండుట కలి పూర్వము 138 క్రీస్తుపూర్వము 3238 ద్వాపరము 864863 దుర్మతినామ సంవత్సరమున నేర్పడి గురునకు

మీనస్థితి యేర్పడినందున నట్లు గురుని మీనమునందుంచబడెను. మఱియు మీనమున 28 వ భాగ 9 వ నవాంశమగు మీన స్వనవాంశమై యున్నత స్థితి యేర్పడినందున నట్లు గురుని మీనమున 28వ భాగలోనుంచఁబడెను

## గురు మీనరాశిస్థితి ఫలము

"శానావిధోద్యాన తటాక సస్య మహోత్స వానేక మఖ క్రియాద్యైః
మీనస్థితే దేవగురావధరిత్రీ రమ్యాక్షితీశా స్సుఖినః పరేచ॥

అని కలదు. కావున గురు మీన రాశిస్థితి యోగ్యముగ నున్నది శని తులారాశిస్థితి ఫలములందును గురు మీనరాశిస్థితి ఫలములందును నేయేవిధముగ వర్ణింపబడి దో యట్లే భాగవత గ్రంథములలో శ్రీకృష్ణావతరణ సమయమున ప్రకృతి వర్ణింపఁబయున్నది.

# ఉదాహరణములు

## శ్రీ మద్భాగవత దశమస్కంధ పూర్వభాగ తృతీయాధ్యాయము

శ్లో॥ దిశః ప్రసేదు ర్గగనం నిర్మలోడుగణోదయం। 1
మహీ మంగళభూయిష్ఠా పుర గ్రామ వ్రజాకరా ॥ 2

శ్లో॥ నద్యః ప్రసన్నసలిలా హ్రదా జలరుహ శ్రియః ।
ద్విజాళికుల సన్నాద స్తబకావన రాజయః ॥ 3

శ్లో॥ వవౌ వాయుః సుఖ స్పర్శః పుణ్యగంధవహ శ్శుచిః।
అగ్నయశ్చ ద్విజాతీనాం శాంతా స్తత్ర సమేధితాః ॥ 4

శ్లో॥ మనాం స్యాసన్ ప్రసన్నాని సాధూనా మసురద్రుహామ్ ।
జాయమానేఽజనే తస్మి న్నేదు ర్దుందుభయో దివి ॥ 5

శ్లో॥ జగుః కిన్నర గంధర్వా స్తుష్టువు స్సిద్ధచారణాః ।
విద్యాధర్యశ్చ ననృతు రప్సరోభిస్సమం ముదా ॥ 6

శ్లో॥ ముముచు ర్మునయో దేవా స్సుమనాంసి ముదాన్వితాః।
మందం మందం జలధరా జగర్జు రనుసాగరం ॥ 7

శ్రీ శ॥ వెం॥ రం॥ శాస్త్రి:- దిక్కులు ప్రసన్నంబులు గాగ నభంబు విమలతారా ప్రభోదయంబై చెలంగఁ బుర గ్రామ వ్రజాకరము లందు సకలమంగళంబుల నెసంగి ధరణి యలర నదులు నిర్మలోద కములై తనర మడువులు జలజవికాసమున విలసిల్ల వనంబులు పులుగులయు దేటులయు నులివుల నెలయు విరిగుత్తులఁ దలిర్ప గ్రొత్తావులఁ గొని మెల్లమెల్లన వీతెంచు చల్లగాడ్పులొలయ ద్విజుల యగ్నిహోత్రంబులు ప్రసన్నతం బ్రజ్వరిల్ల సాధుమానసంబులు ప్రసాదంబు నెనయ దివిదేవ దుందుభులు మొరయఁ గిన్నర గంధర్వులు పాడ సిద్ధచారణులు ప్రస్తుతింప విద్యాధరాప్సరస్సుందరు లాడ సురలు మునులును ముదంబున విరులుగురియ సాగరతీరంబున మొయిళులు మెల్లమెల్లన గర్జిల్ల.*

పోతన

సీ॥ స్వచ్ఛంబులై పొంగె • జలరాసు లేడును
గల ఘోషణముల మే • ఘంబు లుఱిమె
గ్రహతారకలతోడ • గగనంబు రాజిల్లె
దిక్కులు మిక్కిలి • తెలివి దాల్చెఁ
గమ్మని చల్లని • గాలి మెల్లన వీచె
హోమానలంబు చె • న్నొంది వెలిగెఁ
గొలకులు కమలాళి • కులములై సిరినొప్పెఁ
బ్రవిమలతోయలై • పాఱె నదులు

గీ॥ వర పుర గ్రామ ఘోషయై • వసుధ యొప్పె
విహగ రవ పుష్ప ఫలముల • వెలసె వనము

అలరు సోనలు గురిసి ర • య్యమరవరులు
దేవదేవుని దేవకీ • దేవి కనగ ॥ 106

స్వీయరచన

........ ..............గొప్ప • పొడియుం బంటలున్ • వానలలర
సురలు దుందుభులతో • దరహాస మునఁ బుష్ప
వర్షంబుఁ గురియ................
కమలములతో సరస్సులు • కళలు మెఱయ
సర్వశోభనముగ నుర్వి • పర్వుచుండ ॥ 28

కావున, శని తుల, గురు మీన, స్థితులు చాల యోగ్యముగ నున్నవి.

దైవికముగ మొదటనే యుద్దేశించినట్లు శోధించుటలో ఆ మేష స్థితియే రాహువున కేర్పడినందున దైవనిర్ణయమునకు ముగ్ధుఁడై కను గొనినప్రకారము రాహువును మేషమునందు 2వ భాగలో నుంచఁబడెను.

ఈ పరిశీలన ప్రకారము శని తులలో 26 వ భాగలో నుండెను. కావున నయ్యది 8 వ నవాంశ లగ్నాధిప వృషభ శుక్ర నవాంశమైనది. పరమోచ్చ పట్టలేదు.

ఇవ్విధముగ నిప్పటికి యుచ్చలలో చంద్ర బుధ శనియును స్వక్షేత్రములందు రవి గురు లును వర్తించియున్నారు. ఇఁక శుక్ర కుజ స్థితి నిర్ణయించవలసియున్నది.

శుక్రుని నుచ్చ నుంచుటకు వలనుపడదని పైనఁ దెలుపబడియే యున్నది. వృషభ స్వక్షేత్రమున నుంచుటకు రవికి దూరముగ నున్నం దున వలనుపడదు తులా స్వక్షేత్రమందైన నుంచుటకు వర్తించునేమో యని పరిశీలించగ రవికి శుక్రుడు 48 భాగల లోపలనే యుండును. కనుక రవి సింహమున మూడవ భాగలో నుండుటవలన శుక్రుడుతులను

స్పర్శించుటకైననూ వలనుబడదు. శుక్రుడు తులకు వెళ్ళక పూర్వమే కృష్ణాష్టమీలగుచుండును. కృష్ణాష్టమీలకు శుక్రుడు మిథునరాశ్యంతము మొదలు కన్యారాశ్యంతమువరకు మాత్రమే యుండుచుండును. రవి సింహమునకేగు మూడవ దినము ఆగష్టు తే 18,19 దీలలో వచ్చు కృష్ణాష్టమీలకు శుక్రుడు సింహమిందేయున్నట్లు గోచరించుచున్నందున స్వనవాంశ వచ్చినట్లు మఘానక్షత్ర ద్వితీయపాదమున, (5) నైదవ భాగలో నుంచబడెను.

ఇవ్విధముగ నిప్పటికి నుచ్చలలో మూడు గ్రహములను స్వక్షేత్రములలో రెండు గ్రహములను సింహమందు శుక్రుడుండవలెనన్న (ఆంధ్ర) హరివంశము నందైదుగ్రహంబులు స్వోచ్ఛములని తెలిపినన్ని యుండకపోయిననూ నాలుగు గ్రహములకు నుచ్చవచ్చునని కుజుని మకరములో (28) వ, భాగలో 9వ, నవాంశములో పరమోచ్ఛలో నుంచబడెను. ఆ 9వ నవాంశము స్వోచ్చస్థుడైన కన్యాబుధ నవాంశమైనది.

శుక్రుని సింహమందుంచుటవలన నారూఢ లగ్నము వృశ్చికమై యా లగ్నాధిపతి యుచ్చయందుండుటవలన నది యొక సుయోగముగ నేర్పడినది.

ఈవిధముగ నుచ్చగ్రహములు నాలుగు స్వక్షేత్ర గ్రహములు రెండు మొత్తము స్వోచ్చస్వక్షేత్ర గ్రహములారైనవి. శ్రీరామచంద్రమూర్తి జాతకమున స్వోచ్చగ్రహములైదు స్వక్షేత్రమొకటి మొత్తము స్వోచ్చస్వక్షేత్రములారు గ్రహములని పై నుదాహరింపబడియున్నది.

స్వోచ్చగ్రహ సంఖ్యాఫలము

శ్లో॥ ఏకగ్రహోచ్చజాతస్య సర్వారిష్టవినాశనం
ద్విగ్రహో చ్చేతు సామంత త్రి గ్రహోచ్చే మహీపతిః॥
చతు ర్గ్రహోచ్చే సమ్రాట్ స్యాత్ పంచోచ్చే ల్లోకనాయకః

♦ కృప్రకారము గ్రహస్థితుల నేర్పచిన వివరముల పట్టికము ♦

| నక్షత్రము | క్షేత్రము | గ్రహము | భాగ | విశేషాంశములు |
|---|---|---|---|---|
| 1 మఘా ౧ మే | సింహేస్వక్షేత్రేఽ | రవిః | 3 | మేషకుజ ఉచ్ఛ నవాంశము మూ॥త్రి |
| 2 రోహిణీ ౨ యే | వృషభేఉచ్ఛస్థో | చంద్రః | 15 | వర్గోత్తమాంశము |
| 3 ధనిష్ఠా ౨ యే | మకరే ఉచ్ఛస్థో | కుజః | 28 | కన్యాబుధ నవాంశము పరమోచ్ఛము |
| 4 ఉ॥ఫ॥ ౨ యే | కన్యాయాం ఉచ్ఛస్థోబుధః | | 1 | మకర శని నవాంశము స్వోచ్ఛ స్వక్షేత్రము |
| 5 రేవతీ ౪ ర్థే | మీనేస్వక్షేత్రే | గురుః | 28 | మీన స్వ నవాంశము |
| 6 మఘా ౨ యే | సింహేశత్రుస్థో | శుక్రః | 5 | లగ్నాధిప వృషభ స్వనవాంశము |
| 7 విశాఖా ౨ యే | తులయాం ఉచ్ఛస్థో | శనిః | 26 | వృషభ లగ్నాధిప శుక్రనవాంశము |
| 8 అశ్వనీ ౧ మే | మేషే | రాహుః | 2 | మేషకుజనవాంశము |
| 9 చిత్తా ౩ యే | తులాయాం | కేతుః | 2 | తులాశుక్రనవాంశము |

జన్మలగ్న, అంశలగ్న, చంద్రలగ్నములు వృషభ మొకే నవాంశము. ఆరూఢ లగ్నము వృశ్చికము.

| | | |
|---|---|---|
| కలి పూర్వము - 138 | సంవత్సరములు | దుర్మతి సంవత్సరము |
| క్రీస్తుపూర్వము- 3239 | ,, | |
| ద్వాపరయుగము-8,63,863 | ,, | |
| కల్పాది - 197,29,43863 | ,, | |
| సృష్ట్యాది - 195,58,79863 | ,, | |

**రాశి, అంశ ,ఆరూఢ చక్రము**




ఈ చక్రము వ్రాయుటకు గ్రహసంచారములు కనుగొనిన ప్రకారము శని తులకు నికముందు కలి 5084,5085 శాలివాహన 1905 1906, హూణ 1983,1984 వచ్చుసరికి (178) భగణములును, గురుడు మీనమునకు నికముందు కలి 5088, శాలివాహన 1909, హూణ 1987 లో వచ్చుసరికి (442) భగణములును, రాహువు మేషమునకు నికముందు కలి 5087 శాలివాహన 1908 హూణ 1986 వచ్చుసరికి (278) భగణములును కుజుడు కలి 5079 శాలివాహన 1900 హూణ 1979 జనవరినెలలో మకరమునకు వచ్చుసరికి (2775) భగణములును శ్రీకృష్ణపరమాత్మ జననాదిగ నగును.

ఈ జాతకము నీ విధముగ నిర్ణయించి స్వీయరచన శ్రీ మద్భాగవత సారామృత సీసకావ్య దశమస్కంధ పూర్వభాగ ప్రథమబిందువునం దీక్రిందచూపిన పద్యములతో జాతకచక్రమును జాతకచక్రఫలములును వ్రాయబడెను.

సీ॥ దేవతల్ దీవించి దివి కేగు మఱుసటి
దినమౌ నభోమాస ఘన నిశీథ
మునఁ గృష్ణపక్షాష్టమిని రోహిణిన్ శశి
రవి సింహ మొందు సూర్యోదయదినంబు
నను చంద్ర బుధ భౌమ శనులు తదుచ్చంబు
లను ధిషణుండు ఝషంబున వసింప
రవిఁగూడి కవి చతుర్థస్థాన మరంగ
రాహువు సహజంబునన్ రాజిలంగ

గీ॥ వృషభమున విధుఁడుదయింప పృశ్ని కొసఁగు
వరముగా హరి పుట్టె దేవకికి మధుర
వత్సుఁడయి కౌస్తుభంబు శ్రీవత్సచిహ్న
శంఖ చక్ర గదా పంకజములఁ దాల్చి॥ 27

.........................

| | | | | |
|---|---|---|---|---|
| నభోమాసము = శ్రావణమాసము | కాలవర్గు | | శ్లో॥ | 125 |
| నిశీథము = అర్ధరాత్రము | midnight | " | ,, | 114 |
| భౌమ = కుజగ్రహము | mars | దిగ్వర్గు | ,, | 97 |
| ధిషణుఁడు = గురుగ్రహము | jupiter | దిగ్వర్గు | శ్లో॥ | 96 |
| ఝషము = మీనరాశి | pisches | ,, | ,, | 100 |
| కవి = శుక్రగ్రహము | venus | ,, | ,, | 97 |
| అజము = మేషరాశి | aries | ,, | ,, | 100 |
| విధుఁడు = చంద్రుఁడు | the moon | ,, | ,, | 86_87 |

పృశ్ని కొసఁగు వరము:- సీ॥ మద్రచన శ్రీ మద్భాగవత సారామృత దశమస్కంధ పూర్వభాగ ప్రథమబిందువు 36 వ పద్యము చూచునది.

.........................

సీ॥ రవిజుండున్ గవియునుగలగ్నాధిపవృషాంశ
మున రవిమేషాంశ ♦ మున విధుండు
వర్గోత్తమాంశంబు ♦ వర్తించుటను గొప్ప
పాడియుం బంటలున్ ♦ వానలలర
సురలు దుందుభులతో ♦ దరహాసమునఁ బుష్ప
వర్షంబుఁ గురియ దే ♦ వకి కుమారుఁ
గనియె వైవస్వత ♦ మనువున నిర్వదె
న్మిదియగు ద్వాపర ♦ నిస్రవమున

గీ॥ వందముప్పదియెన్మిది ♦ వత్సరములు
వర్షవధి యుండఁగ దుర్మతి ♦ హాయనమున
కమలములతో సరస్సులు ♦ కొలలు మెఱయ
సర్వశోభనముగ నుర్వి ♦ పర్వుచుండ॥ 23

..............................

నిస్రవము :- శేషము, తుది పర్వు:- వ్యాపించు

వర్గోత్తమాంశము:- ఏరాశి కేగ్రహ మధిపతియో యారాశ్యధిపతి నవాంశ మగుట. అట్లు వృషభరాశికి పంచమ నవాంశము వర్గోత్తమాంశము, అది రోహిణీనక్షత్ర ద్వితీయ పాదమునకు సంబంధము కావున చంద్రునకు రోహిణీ నక్షత్ర ద్వితీయపాదస్థితి కలిగినందున వర్గోత్తమాంశమైనది.

ఇట్లేర్పడిన యీ జాతకముయొక్క ఫలితముల గురించి స్వీయ రచన శ్రీమద్భాగవత సారామృత సీసకావ్య దశమస్కంధ పూర్వభాగ ప్రథమబిందువు నందీ క్రిందఁ జూపబడిన పద్యములు కలవు.

సీ॥ జనన కాలమున గో ॥ చారంబునన్ వ్యయ
స్థితి రాహువునకు వ ॥ ర్తించు కతనఁ
బ్రాణభయంబని ॥ పాసె స్వస్థానంబు
షష్ఠమందున నుచ్చ ॥ సౌరి యగుట
శత్రుంజయుఁడగ నా ॥ జన్మాంతిముఁ జెలంగె,
నుచ్చచంద్రుఁడు లగ్న ॥ మొప్పు కతనఁ
దనుభావ మొప్పె ము ॥ గ్ధత; మాతృకారకా
ధిపు లన్యమాతృ సం ॥ తృప్తి నిడిరి

గీ॥ సప్త పంచమ సాంధ్యేశు లు ॥ చ్చస్థు లగుట
దారకారకుఁడును చతు ॥ ర్థమున నుంట
లాభమున గురుఁ డలరుట ॥ శోభనముగ
i) నమితముగ సతీ సుతు లుండి ॥ రమల చరిత!॥ 29

..........................

సౌరి=శని Saturn దిగ్వర్గ శ్లో॥ 98 అధికపాఠము మూరస్య అపత్యం పుమాన్ "సౌరిః"

i) అమితముగ సతీసుతులుండిరి:- ఈ విషయమునకై స్వీయ రచన దశమస్కంధోత్తరభాగ ప్రథమబిందువు 89, 108, 127 పద్యము లను 127 వ పద్యముయొక్క అధస్సూచికయందు జూచునది.

..........................

సీ॥ అంబుజాప్తుండు కేం ద్రంబున నొప్పట
సైంహికేయుఁడు ద్వాద శమున నుంట
శత్రుగేహమున నా శత్రుతోఁ గవి యుంట
నలరె బాలారిష్ట మట్లు బాల్య
మునఁ బూతనాది దు ర్దనుజులచేఁ బ్రాణ
భయము గల్గియు నవి భంగమయ్యె
నెట్లన; సౌరి బు ధేందు మహీసుతు
లుచ్చమై శుభయోగ యుక్తు లగుట

గీ॥ మఱియు నా ద్వాదశాత్మండు మహితయోగ
కారకుం డౌట జీవిత కాల మెల్ల
సకల సౌభాగ్యముల నొంది శాత్రవులను
శిక్షితులఁ జేసి నిజపదా శ్రితులఁ గాచె 30

సైంహికేయుడు=రాహువు The ascending node దిగ్వర్గల్లో॥ 99

సీ॥ మునుపు తెల్పిన యట్లు శని చంద్ర రవి బుధుల్
ముదితులౌ రాజయో గమౌ గాక
లాభాష్టమేశుండు లాభాలయం బొందు
టది రాజయోగమౌ నదియుఁ గాక
యారూఢలగ్న జా యాధ్యుఁడై భాగ్య
మందు నుచ్చస్థుడై యావని సుతుఁడుఁ

వంశలో గురు వీక్ష ణాది సులక్షణుం
డౌట నాభౌముఁ డ త్యంతరాజ
గీ॥ యోగదుం డయ్యె; రాహువు యోగదుండె
వ్యయ శుభార్గళ మేష ప్ర వర్తనమున;
మాలికారూఢ యోగమై హోళిఁ గూర్చ
వినుము వినిపింతు నవలి గా థను నరేంద్ర!॥ 31

...............................

* ఇక జాతక ఫలంబులను వక్ష్యమాణంబుగ వివరింపబడుచున్నవి. *

**గోచారము :-** జననకాలమునకు గోచారవశాత్తు రాహువునకు వ్యయస్థితి కలిగినందున కారాగృహమున జనించుట వెంటనే స్థానచలనము కలుగుట సంభవించెను.

...............................................

చతు, రష్టమ, ద్వాదశ, పంచమ, గే
శని, సైంహిక, భార్గవ, భూమిసుతాః
వధ, బంధ, నిరర్థక, రోగకరాః॥

శ్లో॥ ద్వాదశాష్టమ జన్మస్థానే న్యర్కాంగరకా గురుః।
కుర్వంతి ప్రాణ సందేహం స్థానభ్రంశం ధనక్షయమ్॥

ఈ రాహువునకు శుభార్గళ పట్టినందునను గురునకు లాభస్థితి గలిగినందునను కీడు కలుగలేదు.

మఱియు జన్మాది 2,3 నెలలలో నీవ్యయరాహువునకు లాభస్థితియును, నదేరోజులలో లాభగురునకు వ్యయస్థితియును వచ్చును. కావున నదేరోజులలో పూతనవధ, మఱికొన్ని రోజులలో శకటాసురవధ జరిగెను. ఒక సంవత్సర వయస్కుడుగ నున్నప్పుడు తృణావర్తవధ జరిగెను.

గురుడు గోచారవశాత్తు దోషియగుటవలన పై సంఘటనలు సంభవించినప్పటికి, రాహువునకు లాభస్థితి యగుటవలన నవన్నియు నిర్జింప గలిగెను. గురునకు వ్యయ, జన్మ, స్థితి రెండుసంవత్సరముల వరకునుండును. అంతవరకు గోచారదోషములు కలవు.

మూడువ సంవత్సరాంతమునకు శనిఅష్టమమునకు వచ్చునుకావున మరల మూడవ సంవత్సరమునుండి గోచారదోషము పట్టెను. అట్లగుట రెండవ సంవత్సరముదాటినమండి మూడవసంవత్సరము కడచినవరకు మాత్యమొక సంవత్సరకాలము నందెట్టి గోచారదోషములు పట్టలేదు. మూడవ సంవత్సరము దాటిన నుండి శనివశాత్తు మరల గోచార దోషములు కలవు. అప్పటిలో మరల స్థానచలనము నందవ్రజమునుండి బృందావనమునకు నైదవయేట కదలుట సంభవించెను. వత్సాసుర బకాసుర అఘాసుర సంహారములు జరిగెను. రెండు మూడు సంవత్సరముల మధ్య నెవ్విధమైన గోచార దోషములులేవు. సుఖముగ నానందముగ నున్న రోజులవి. ఈ యావత్తు కాలము మహాయోగ కారకుఁడగు చంద్ర మహాదశయైనందున గోచార దోషమువలన వచ్చిన బాధలచే నెట్టి దుర్ఘటనలు జరుగకుండ దశానాథుఁడు కాపాడుచుండెను.

### * బాలారిష్టములు *

"రవిశ్చ రవిపుత్రశ్చ భూమిపుత్రశ్చ కేంద్రగాః"

ఆవిధముగ నీ జాతకమునందు రవిబాలారిష్టకారకుఁడైయున్నాఁడు. ఆ దోషకారణమే బాల్యమున ననేక ప్రాణాపాయ కరమైన, పైని వివరించిన పూతన, శకటాసుర, తృణావర్త, వత్సాసుర, బకాసుర, అఘాసుర, కాళియఫణిమర్దన మొదలగు సంఘటనలు కలిగినవి. మఱియు రాహువు వ్యయమందును లగ్నాధిపతి శుక్రుఁడు శత్రుక్షేత్ర

మందు శత్రువైన రవితోఁ గూడియున్నందున నంశలోఁ జంద్రునకు శని సంబంధము కలిగినందున చంద్రునకు నంశలో పంచమ కోణమగు కన్యయందు కుజుఁడున్నందున రాశి చక్రమున లగ్నాధిపతి శుక్రునకు కుజాష్టమ దృష్టియున్నందున రవికేంద్రగుం దుండుటవలన నీ జాతకు నకవన్నియు బలారిష్టములు. అరిష్టములన్నియు రిష్టభంగయోగముల వలన భంగములై నిరపాయముగ, సురక్షితముగ నుండెను.

* అరిష్టభంగ యోగములు *

అరిష్టము-రిష్ట :- ఈ రెండు నొకయర్థముగ శుభాశుభము లను నర్థము కలదు. కావున నిందు అశుభములో నీరెండును వచ్చును.

"ఆయుస్థానే శనౌషష్ఠ, పంచ, మాష్టమ, లాభగే
ఐశ్వర్యాం సతతం బ్రూయా దాయుర్వృద్ధిం యశస్సుఖం"
త్రిషడేకాదశే సూర్యః త్రిషడేకాదశే శనిః।
త్రిషడేకాదశే రాహుః సర్వారిష్టం వినశ్యతి"

వీనిని బట్టి ఆఱవయింట శనియుండుటను మఱియు నాశనికి నుచ్చస్థితి కలిగినందునను సర్వారిష్టములు భంగమైనవి.

"స్వోచ్చస్థః స్వగృహేఽపివా స్వ, సుహృదాం వర్గేఽపి సౌమ్యేఽపివా
సంపూర్ణం శుభవీక్షితః శశధరో వర్గేస్వకీయేఽపివా
శత్రూణామవలోకనేన రహితః పాపైరయుక్తేక్షితా
రిష్టం హంతి సుదుస్తరాం దినపతిః పాలేయరాశిం యథా॥"

జ్యో॥ మ॥ మాల

దీనినిబట్టి బుధ చంద్రుల రిష్టభంగకారకులు. చీఁకటిని సూర్యుఁడు నశింపఁజేసినట్లు సమస్తారిష్టములు పోగొట్టఁబడెను.

"చంద్రికా శుభవర్గస్థః యోగోఽపిచ శుభేక్షితే
హంతాం రిష్టం జ్వరమివ మహాతిసారంజాతీఫలంవళ్ళ్యాలః కథితం॥"
జ్యో॥ము॥మాల॥

దీనినిబట్టి వర్గోత్తమాంశమందు జంద్రుఁడున్నందున జాజికాయ దాల్చినచెక్కవల్ల జ్వరము మహాతిసారముఁ (జ్వరాతి సారము) నశించు నట్లు నిర్విష్టములు నశించెను.

అఘాసురభంజనమువఱకు చంద్రమహాదశలో అటు పైని కాళియ ఫణిమర్దన చంద్రమహాదశాంతము కుజమహాదశ ప్రారంభము. ఆమధ్య కాలములో గోవర్ధనగిరి నెత్తుట కుజమహాదశలో జరిగెను. ఈ చంద్ర, కుజులు, మహారాజయోగ కారకులు కావున వారిదశలలో నెవ్విధమైన గోచారదోషములు గాని బాలారిష్ట దోషములుగాని బంధించలేదు.

శ్లో॥ బుధ భార్గవ జీవానా మేకః కేంద్రేపి వా బలీ
సద్యో మరణయోగానాం ప్రోక్తానాం భంగ కారణమ్॥

ఇంక నీ జాతకముయొక్క భావములు యోగములు దశాంతర్ద శాఫలము లనేకములు జ్యోతిష సిద్ధాంతులు పలువురు పలువిధంబుల ప్రశస్తిని దెలుపుదురు. ఎంత వ్రాసినను గలదు. కావున కొలఁది విషయములు వ్రాసి గ్రంథవిస్తరణ భీతిచే ముగింపబడినది.

జన్మలగ్నమున నుచ్చస్థుడైన చంద్రుఁ డుండుటవలన జాతకుఁడు బంగారువన్నెగా నుండవలెను కాని అంశలగ్నములో గ్రహమిశ్రమము వలనబంగారు వన్నెగా నుండలేదు.

రవి శుక్రులు మాతృస్థానమందుంటచేతనూ ఆ రవి శుక్రులు శత్రువు లగుట వలననూ జన్మస్థానమందు స్వమాతృత్యాగము కలిగినది. ఐననూ మాతృకారకుఁడై చంద్రునకు వర్గోత్తమోచ్చములైనందున నన్య మాతృసాహ్యమునూ చాలసౌఖ్యముగ స్వగర్భజనితుఁడుగ వెలసెను.

శ్లో॥ తుంగే సప్త శేశే స్మరగేపునగ్రహేతాం శుక్రయుక్తా
యది శుక్రదృష్టా భార్యాస్త్వనేకా (గోపాలరత్నాకరము)

దీనినిబట్టి కళత్రస్థానాధిపతి కుజుఁడు కోణమందు నుచ్చస్థుఁడై యుండుటయు కళత్రస్థానమందు శుభగ్రహము లేకపోయిననూ ఆస్థానము స్వక్షేత్రవర్తియు శుభుడునగు గురుఁడు చూచుచుండుటవలన కళత్ర స్థానమునకు శుభగ్రహ సంబంధమగుటవలన నయ్యాది యారూఢలగ్న మైనందున నారూఢలగ్నమును గురుడు చూచుచున్నందుననారూఢలగ్నవ శాత్తురాశి అంశచక్రములలో పుత్రస్థానమునందు గురుడుండుటవలననూ దారపదమునందు గురుడుండుట వలనను దారపదముననున్న గురునకును సుతారూఢముననున్న బుధునకును వీక్షణమున్నందుననూ అంశచక్రమున గురుకుజులకు వీక్షణమున్నందుననూ ఆరూఢలగ్నవశాత్తు అంశ చక్రమున సప్తమమున స్వక్షేత్రమున కళత్ర కారకుడగు శుక్రుడున్నందుననూ ఆరూఢలగ్నవశాత్తు రాశిచక్ర మందు శుక్రుఁడురాజ్యస్థానమందుండుటవలననూ అంశలగ్నవశాత్తు లగ్నమందు స్వక్షేత్రవర్తియై శుక్రుడుండుటవలననూ ఉపపదమందు ఉచ్చశని చర కేతు బృహస్పతియుక్తుడై యుండినందుననూ పంచమ సప్తమ భావము లత్యుత్కృష్టముగ నుండిన కారణమున బహుభార్యాయోగమును విదుషీ మణీయోగమును బహుపుత్రయోగమును గలదని స్పష్టముగ నున్నది. అమితముగ సతీసుతులగురించి యిందు 24 వ పద్యము యొక్క అర్థసూచిక [illegible]చున్నది.

చన్ద్ర[illegible] ందు శుక్రుఁడు ఏకాశమందు దారపదమందు గురు డున్నందుననూ సప్తమాధిపతి కుజుడై యాతనికి నుచ్చస్థితి కలిగిన యోగము[illegible]నూ గాలి పువ్వువాసన హరించినట్లు స్త్రీలయొక్క చిత్త హరణ[illegible] యోగము గలిగినది.

ఛాయాగ్రహంబులగు, రాహు కేతువులకు స్వగృహంబులు లేవు. అట్లగుట వార లేరాశిలో నుందురో యా రాశ్యధిపతిగ వ్యవహరింతురు. ఇందున్న రాహువు మేషమున నున్నందున ఆమేషరాశ్యధిపతియగు కుజునిగ వ్యవహరించును ఆకుజునకు నింకను వృశ్చికముకూడా గృహమగుట నీరాహువు మేషవృశ్చికముల కధిపతిగ వ్యవహరించును. కావున రాహువు తన సంచారక్రమంబుగ ద్వితీయ సప్తమాధిపతియైనందున నా రాహువునకుఁ గళత్ర కారకుఁడగు శుక్రుఁడు కోణమునందుండుటనుబట్టి రాహు మహాదశ శుక్రాంతరమున వివాహయోగము కలదు. రాహు మహదశ కేత్వంతరము భుక్తి సం 24-॥-18 దినములు తరువాత రాహుమహాదశ శుక్రాంతరము మూడు సంవత్సరములు. అనగ సం. 27-9-18 దినములవరకు వివాహయోగము కలదు. దాన నాకాలమున నీజాతకుని వివాహము లన్నియు జరిగియున్నవి.

శ్లో॥ వ్యయేచ పాపసంస్థేతు వ్యయేశే పాపసంయుతే।
పాపగ్రహేణ సంస్పృష్ట్వా దేశదేశాంతరం గతమ్॥

దీనినిబట్టి వ్యయస్థానమున రాహువుండి దానిని శని, కుజులు చూచుచున్నందున నీ యోగము వర్తించినది. ఇందునుబట్టి మధురానగరము విడిచిపెట్టి ద్వారకానగరమునకు పురలుట సంభవించినది.

శ్లో॥ దివాకసాం పతే ర్మంత్రీ కుర్యా త్పశ్య న్బుధం సదా
శిరసా శాసనం తస్య ధారయంతి నృపాలకాః॥

గురు బుధులు కలసియున్నను ఒకరి నొకరు చూచుచున్నను అటి జాతకుని యాజ్ఞ రాజాధిరాజులుకూడ ధరింతురు.

మేషప్రవర్తనమున రాహువు యోగదుఁడు.

శ్లో॥ అజ వృషభ కర్కట స్థేపిరాహు ....................

వృద్ధపారాశర్యమున నీ దిగువ వివరించిన శ్లోకములు చూచునది.

రవినిగురించి :- రవిఫలములలో 7,8,9,10,11, శ్లోకములు

చంద్రునిగురించి :- చంద్రఫలములలో 1,2,5, ,,

కుజునిగురించి :- కుజఫలములలో 1 నుండి 5 వరకు ,,

రాహువునుగురించి :- రాహుఫలములలో 1,10 ,,

గురునిగురించి:- గురుఫలములలో 1 నుండి 5 ,,

శనినిగురించి :- శనిఫలములలో 1 నుండి 5 ,,

బుధునిగురించి :- బుధఫలములలో 1 నుండి 4 ,,

కేతువునుగురించి :- కేతుఫలములలో 1 నుండి 4 ,,

శుక్రుని గురించి :-

శ్లో॥ కేంద్రాన్వి తస్య భృగు జస్య దశావిపాకే
స్త్రీపుత్రసౌఖ్య విభవం మణివస్త్ర లాభం
భూపాత్సుఖంచ వర వాహన వృద్ధిదంచ
ధాన్యాభి వృద్ధిమతులం పశుదాన వృద్ధిం॥ శ్లో॥ 39 పుట 362

శ్లో॥ మంత్రాభిచార కుశలో బహుతనయః పంచమే సౌమ్యే
విద్యాసుఖప్రభావైః సమన్వితో హర్షసంయుక్తః॥

బుధుడు పంచమ భావముననున్నయెడల మంత్రవిద్యలందునేర్పు కలవాడు చాలమంది కుమారులు కలవాడు బహువిద్యలు నేర్చువాడు వానివలన సుఖములు పొందువాడు ప్రతిభాశాలి యెల్లప్పు డానందముతో గూడినవాడు.

శ్లో॥ క్రాంతేవా గురు శుక్రాభ్యాం కేనాప్యుచ్ఛ గ్రహేణవా
దుష్టార్గలా గ్రహాఽభావే రాజయోగో న సంశయః॥

దీనినిబట్టి ఆరూఢలగ్నమునకు చంద్రుడు చూచుచున్నాడు.

శ్లో॥ జన్మకాలఘటే లగ్న ఏకేనైవ నిరీక్షితే
ఉచ్చారూఢే తు సంప్రాప్తే చంద్రాంక్రాంతే విశేషతః॥

ఘటికాలగ్నము మీన మగుటచే దానిని గురుడు చూచుచుండుట గొప్ప విశేషము.

జాతక మార్తాండము తృతీయభాగము

వృషభలగ్నఫలము

(రవి) చతుర్థే వాహనోద్యోగం
(చంద్ర) వృషభే పూర్ణచంద్రస్థే సురూపం పూర్ణభాగ్యదః
(కుజ) నవమే రాజయోగస్స్యాత్
(బుధ) పంచమేఽఖండయోగస్స్యాత్
(గురు) లాభే ధర్మార్జనం విత్తమ్
(శుక్ర) చతుర్థే సాహిత్యయాన భూసంపాదకో భవేత్॥
(శని) షష్ఠేఽపాయ ధనాప్తిశ్చ

ఇక శ్రీకృష్ణ భగవానుని జనన సమయమునకు, కల్ప, యుగ, వత్సర,దినాది,తృటిపర్యంతము వక్ష్యమాణంబుగ వివరింపఁబడుచున్నది.

శ్లో॥ అష్టాదశ నిమేషాస్తు కాష్ఠా త్రింశత్తు తాః కలాః। తాస్తు త్రింశత్క్షణ స్తేతు ముహూర్తో ద్వాదశాఽస్త్రియామ్॥తేతు త్రింశ దహోరాత్ర: పక్షస్తే దశ పంచ చ। పక్షౌ పూర్వాపరౌ శుక్ల కృష్ణౌ మాస స్తు తా వుభౌ॥ ద్వౌద్వౌ మాఘాదిమాసౌ స్యా దృతు స్తై రయనం త్రిభిః। అయనే ద్వే గతి రుద గ్దక్షిణార్క స్య వత్సరః॥

కాలవర్గు 11నుండి12।

| | |
|---|---|
| (18) రెప్పపాట్లు | 1 కాష్ఠము Time measured by 18 |
| (30) కాష్ఠములు | 1 కల Eight seconds |
| (30) కలలు | 1 క్షణము Four minutes |
| (12) క్షణములు | 1 ముహూర్తము 48 minutes |
| (30) ముహూర్తములు | 1 అహోరాత్రము A day and night |
| (15) అహోరాత్రములు | 1 పక్షము A fortnight |
| (2) పక్షములు (శుక్లకృష్ణ) | 1 నెల Light and dark fortnights month |
| (2) నెలలు | 1 ఋతువు A season |
| (3) ఋతువులు | 1 అయనము A half-year |
| (2) అయనములు | 1 సంవత్సరము A year |
| (360) సంవత్సరములు | 1 దేవవత్సరము |

ఈ మానము ప్రకారము సౌరమాన వత్సరము దేవతల కొక దినముగను. అందుత్తరాయణము పగలుగ దక్షిణాయనము రాత్రిగనుండును చాంద్రమాన మాసము పితృదేవతల కొక దినముగ నందు శుక్లపక్షము పగలుగ, కృష్ణ పక్షము రాత్రిగ నుండును.

శ్లో॥ మాసేన స్యా దహోరాత్రః పైత్రో వర్షేణ దైవతః।

ఈవిధముగ నేర్పడిన 360 సౌరాబ్దములు దేవతల కొక వత్సరమగును.

శ్లో॥ దివ్యై ర్వర్ష సహస్రై ర్ద్వాదశభి ర్దైవతమ్ యుగమ్॥
దైవే యుగసహస్రేద్వే బ్రాహ్మః కల్పౌ తు తౌ నృణామ్॥

కాలవర్గు 129, 130 శ్లోకములు.

అట్టి దేవవర్షములు పన్నెండువేలొక దేవయుగ మగును. (కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు) కావున నట్టి దేవయుగ సౌరాబ్దప్రమాణము.

360X12000=43,20,000 (నలువదిమూడులక్షల యిరువదివేలు)

ఈ కాలము నాలుగు యుగములకేర్పరచిన క్రమ మెట్లనఁ బ్రతియుగమున కిరువైపుల సంధు లుండును. ఆ సంధులను యుగసంధు లందురు. కృతయుగము నాలుగు పాదములు త్రేతాయుగము మూడుపాదములు, ద్వాపరయుగము రెండుపాదములు కలియుగము ఒక పాదముగ విభజింపఁబడియున్నవి. యుగసంధి యుగప్రమాణములో దశాంశము చొప్పున రెండువైపులనుండును. కావున నొక దేవయుగమున కీ క్రింద వివరించిన ప్రకారముగ సంధిసహిత యుగ ప్రమాణము లుండును. దేవయుగము పండ్రెండువేల దివ్యవర్షములలో పదివేలు యుగముల గురించి రెండువే లిరువైపుల యుగసంధుల గురించి పూర్వు లేర్పరచిరి.

| | | | |
|---|---|---|---|
| కృతయుగము | 4000 | 4800×360 | = 1728000 |
| ఇరువైపుల సంధులు | 800 | | |
| త్రేతాయుగము | 3000 | 3600×360 | = 1296000 |
| ఇరువైపుల సంధులు | 600 | | |
| ద్వాపర యుగము | 2000 | 2400×360 | = 864000 |
| ఇరువైపుల సంధులు | 400 | | |
| కలియుగము | 1000 | 1200×360 | = 432000 |
| ఇరువైపుల సంధులు | 200 | | |

12,000×360=43,20000, సౌరాబ్దములు.

| దేవయుగములు 12,000×360=43,20,000 నలువదిమూడు లక్షల యిరువదివేల సౌరాబ్దములు | | | |
|---|---|---|---|
| సంధి 400 | సంధి 300 | సంధి 200 | సంధి 100 |
| యుగము 4000 | యుగము 3000 | యుగము 2000 | యుగము 1000 |
| సంధి 400 | సంధి 300 | సంధి 200 | సంధి 100 |
| కృతయుగము<br>4800×360=17,28,000 | త్రేతాయుగము<br>3600×360=12,96,000 | ద్వాపర యుగము<br>2400×360=<br>8,64,000 | కలియుగము<br>1200×360=<br>4,32,000 |

ఇట్టి దేవయుగములు వెయ్యి పగలుగను, వెయ్యి రాత్రిగను బ్రహ్మ కొక దిన మగును.

43,20,000×1000=432,0000000 నాలుగు వందల ముప్పదిరెండు కోట్ల సౌరాబ్దములు బ్రహ్మపగలు, రాత్రియు నంతే కాలము. కావున బ్రహ్మాహః ప్రమాణము 864,0000000 ఎనిమిదివందల యరువది నాల్గుకోట్ల సౌరాబ్దములు బ్రహ్మదినము.

బ్రహ్మపగలు 432 కోట్ల సం॥లలో 14 రు మనువులుపాలింతురు.

1. స్వాయంభువ, 2. స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస, 5 రైవత, 6. చాక్షుష, 7. వైవస్వత, 8. సూర్యసావర్ణి, 9 దక్షసావర్ణి, 10. బ్రహ్మసావర్ణి, 11. ధర్మసావర్ణి, 12. రుద్రసావర్ణి, 13 రౌచ్యక, 14. భౌచ్యక అను పదునల్వురు మనువులు పాలింతురు. 9నుండి 14వరకు పేర్లు కొన్ని మతములప్రకారము వ్యత్యాసముగనున్నవి.

పైనవ్రాసిన పదునాల్గు పేర్లు విష్ణుపురాణము తృతీయాంశము ప్రథమ, ద్వితీయాధ్యాయములలో వివరముగ నున్నవి.

శ్లో॥ మన్వన్తరం తు దివ్యానాం యుగానా మేకస ప్తతిః కాలవర్గ శ్లో॥130

ఒక్కొక్క మనువు 71 మహాయుగముల చొప్పున పాలింతురు. కావున 71×14=994 మహాయుగములు మనువులు 14 రి పాలనలో నుండును. ఈ మనువులకు సంధు లుండును. ఈ సంధులను మను సంధు లందురు. ఈ సంధులు యుగసంధులవలె మనువున కిరువైపుల నుండవు. మనువునకు మనువునకు మధ్యనే సంధియుండి మొదట నొక సంధియు చివర నొక సంధియు నుండును. కావున 14 రు మనువులకు 15 సంధు లుండును. ఈ 15 సంధుల గురించి మహాయుగములు వెయ్యిలో మనువుల పాలనలోనున్న 994 మహాయుగములు గాక శేషించిన యారుమహాయుగముల నేర్పఱచిరి అట్లగుట మనుసంధి 17,28,000 పదునేడు లక్షల యిరువదియెనిమిదివేలు సౌరాబ్దములై యున్నది.

బ్రహ్మకల్ప ప్రమాణము 12000x360x1000=4320000000 నాలుగువందలముప్పదిరెండుకోట్లు 3

| | | |
|---|---|---|
| | 1వ, సంధి | 1728000 |
| గతకాలము | 1 స్వాయంభువ | 4320000 X 71 = 306720000 |
| | 2వ, సంధి | 1728000 |
| | 2 స్వారోచిష | 4320000 X 71 = 306720000 |
| | 3వ, సంధి | 1728000 |
| | 3 ఉత్తమ | 4320000 X 71 = 306720000 |
| | 4వ, సంధి | 1728000 |
| | 4 తామస | 4320000 X 71 = 306720000 |
| | 5వ, సంధి | 1728000 |
| | 5 రైవత | 4320000 X 71 = 306720000 |
| | 6వ, సంధి | 1728000 |
| | 6 చాక్షుస | 4320000 X 71 = 306720000 |
| | 7వ, సంధి | 1728000 |
| [illegible] | 7 వైవస్వత | 4320000 X 71 = 306720000 |
| | 8వ, సంధి | 1728000 |
| భవిష్యత్కాలము | 8 సూర్యసావర్ణి | 4320000 X 71 = 306720000 |
| | 9వ సంధి | 1728000 |
| | 9 దక్షసావర్ణి | 4320000 X 71 = 306720000 |
| | 10వ, సంధి | 1728000 |
| | 10 బ్రహ్మసావర్ణి | 4320000 X 71 = 306720000 |
| | 11వ, సంధి | 1728000 |
| | 11 ధర్మసావర్ణి | 4320000 X 71 = 306720000 |
| | 12వ, సంధి | 1728000 |
| | 12 రుద్రసావర్ణి | 4320000 X 71 = 306720000 |
| | 13వ, సంధి | 1728000 |
| | 13 రౌచ్యక | 4320000 X 71 = 306720000 |
| | 14వ, సంధి | 1728000 |
| | 14 భౌచ్యక | 4320000 X 71 = 306720000 |
| | 15వ, సంధి | 1728000 |

మహాయుగ ప్రమాణము 43,20,000×6 ÷ 15=17,28,000, కృతయుగ ప్రమాణముకూడ మనుసంధి ప్రమాణమంత దగుటను మనుసంధి కాలము కృతయుగ ప్రమాణమంతదైనది. ఈవిధముగ శ్రీకృష్ణపరబ్రహ్మ జననసమయమునకీబ్రహ్మహమున నెంతకాలమైనది వివరింపబడుచున్నది.

| | |
|---|---|
| ఒక మనువు కాలము 43,20,000×71= | 30,67,20,000 × 6= |
| గతించిన ఆర్వురు మనువుల కాలము నూటయెనుబది నాలుగుకోట్ల మూడు లక్షల యిరువదివేలు. | 184,03,20,000-0-0-0-0 |
| ఆర్వురు మనువులు గతించి యేడవ మనువు నడుచుచున్నందున ప్రారంభ సంధినుండి యేడు మనుసంధులు గతించినందున ఆ సంధుల కాలము 17,28,000×7= | 1,20,96,000-0-0-0-0 |
| గతించిన 6 మనువులు 7 సంధుల కాలము= | 185,24,16,000-0-0-0-0 |
| వర్తమాన సప్తమ మనువగు వైవస్వత మనువులో గతించిన మహాయుగములు 27, కావున 43,20,000×27= | 11,66,40,000-0-0-0-0 |
| వర్తమాన 28వ, మహాయుగము నందు గతించిన కృతయుగ ప్రమాణము | 17,28,000-0-0-0-0 |
| త్రేతాయుగ ప్రమాణము | 12,96,000-0-0-0-0 |
| ద్వాపరయుగమున గతించినవత్సరములు | 8,63,862-0-0-0-0 |
| శ్రీకృష్ణ పరమాత్మ జనించిన ద్వాపర యుగ వర్తమాన 8,63,863 వ సంవత్సర మగు దుర్మతి సం॥ మున భుక్తి | 0 4 22 46 10 |
| | 197,29,43,862-4-22-46-10 |

శ్రీకృష్ణ పరమాత్మ జననకాలమునకైన వర్తమానబ్రహ్మహః ప్రమాణము మూటతొంబదియేడుకోట్ల యిరువది తొమ్మిది లక్షల నలువదిమూడువేల యెనిమిదివందల అఱువదిరెండు సంవత్సరముల నాలుగునెలల యిరువది రెండు దినముల నలువదియాఱు ఘడియల పది విఘడియలు.

శ్రీకృష్ణపరమాత్మ జనించి వర్తమానమున కెంతకాలమైనదనుటకు పైన వివరించిన ద్వాపర శేషమగు సం॥ 137-7-7-13-50 విఘడియలలో వర్తమాన కలియుగము చేర్చిన లబ్ధము వచ్చును.

ఇందు కల్పారంభమున 1,70,64,000 ఒక కోటి డెబ్బది లక్షల అఱువది నాలుగువేల వత్సరములవఱకు సృష్టిలేదు. కావున సృష్ట్యాదిగ అనునపుడు పై సంఖ్య మినహాయించవలెను. అట్లు సృష్ట్యాదిగ శ్రీకృష్ణ పరమాత్మ జననకాలము 195,58,79,862-4-22-46-10 విఘడియలు. 1,70,64.000 వఱకు సృష్టి యేల ప్రారంభింపబడలేదు? పూర్వ కల్పముయొక్క రాత్రి 432 కోట్ల సంవత్సరములు భూమి జలమయమై యుండినందున కఱగి ఆ 432 కోట్ల సంవత్సరములు పూర్తియగు సరికి నీరు పూర్తిగా నింకి భూమి అడుసుగా నుండి సృష్టికి వీలగునట్లు భూమి గట్టితన మేర్పడలేదనియు, గట్టితన మేర్పడిన తరువాత సృష్టియేర్పడి ప్రజోపయోగకరములగు ఓషధులు ఫలవృక్షములు మృగ పక్ష్యాదులు సృష్టించిన తరువాత మానవసృష్టి ప్రారంభింపబడెనని తలంప బడుచున్నది. 432 కోట్ల సంవత్సరములు నీటిలో గఱగిన భూమి మరల ఘనీభవించుటకు 1,70,64,000 సంవత్సరములు పట్టుటాశ్చర్యముకాదు.

ఇక శ్రీకృష్ణ పరమాత్మ జననకాలమునకు నీకల్ప ప్రమాణము 197,29,43,862-4-22-46-10 విఘడియల సరికి బ్రహ్మమానము ప్రకారము బ్రహ్మవయ స్సెంతయో దిగువ వివరింప బడుచున్నది.

864 కోట్ల సంవత్సరములు బ్రహ్మ కొకదినమని, పైనఁదెలుపఁ బడియున్నది. అట్టి దినములు 360 అయినచో నొక సంవత్సరమగును.

ఈ మానము ప్రకారము కలియుగము బ్రహ్మ కొక ప్రాణమును గుర్వక్షరోచ్చారణములో 4/5 అయిదు వంతులలో నాలుగు వంతులును.

ఈ మానము ప్రకారము శ్రీకృష్ణ పరమాత్మ జనన సమయమునకు బ్రహ్మవయస్సు.

| సం | నె | ది | ఘ | విఘ | ప్రా | గుఃఅ | నిమే | లవ | త్రుటి | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 50 | 0 | 0 | 13 | 42 | 0 | 3 | 16 | 3 | 21 | దాటి 22వ త్రుటిలో |

* నె2 ది2 ఘ46 విఘ 10 అయిఉన్నవి. అద్యాదీ క్రింద వివరింపఁ బడుచున్నది.

197,29,43,862-4-22-46-10 శ్రీకృష్ణ పరమాత్మ జనన సమయము
187,20,00,000-0-00-00-00 (౧౩ ఘడియల ప్రమాణము)

10,09,43,862-4-22-46-10
10,08,00,000-0-00-00-00 (౪౨ విఘడియల ప్రమాణము)

1,43,862-4-22-46-10
0-0--00-00-00 (౦ ప్రాణములు)

1,43,862-4-22-46-10
1,20,000-0-00-00-00 (3 గుర్వక్షరోచ్చారణకాల ప్రమాణము)

23,862-4-22-46-10
23,703-8-13-20-00 (16 నిమేషముల ప్రమాణము)

158-8-09-26-10
148-1-23-20-00 (3 లవకాలముల ప్రమాణము)

10-6-16-06-10
10-4-13-20-00 (21 త్రుటికాలముల ప్రమాణము)

* 2-02-46-10

ఇవ్విధమున కల్యబ్దాః 5077 నల సంవత్సరాంతమునకు

| ఘ | విఘ | ప్రా | గు॥ఉ | వి | ల | తృ | నె | ది | ఘ | విఘ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 13 | 42 | 0 | 3 | 19 | 18 | 80 | 5 | 14 | 26 | 40 |
| జననము సరికి | | | | | | | | | | |
| 13 | 42 | 0 | 3 | 16 | 3 | 21 | 2 | 2 | 46 | 20 |
| అటనుండి ద్వాపర యుగాంతముసరికి 137-7-7-13-50 | | | | | 2 | 78 | 3 | 25 | 00 | 20 |
| 13 | 42 | 0 | 3 | 16 | 6 | 00 | 0 | 0 | 00 | 00 |
| కలిభుక్తి 5077 అంతము అనగా నలాంతముసరికి | | | 3 | | 12 | 80 | 5 | 14 | 26 | 40 |
| 13 | 42 | 0 | 3 | 19 | 18 | 80 | 5 | 14 | 26 | 40 |

కావున కలి 5078 పింగళనామ సంవత్సరారంభమున ది 13 ఘ 20, పదమూడు దినముల యిరువది ఘడియలకు 81 యెనుబది ఒకటవ తృటి పూర్తి అగు

బ్రహ్మణః పరార్ధస్యాయుషోర్ధంగతం ద్వితీయ పరార్ధే శ్వేతవరాహకల్పే ప్రథమవర్షే ప్రథమమాసే ప్రథమపక్షే ప్రథమ వాసరే వ్వమానేన త్రయోదశ (౧౩) ఘటికాః ద్విచత్వారింశ (౪౨) విఘటికాః ప్రాణకాలః (౦) అని సమయమునకు సరిపడినట్లు గుర్వక్షరోచ్చారణ నిమేష లవ తృటి కాలములు సంకల్పము చెప్పుదురు. నెల ది 27 ఘ 46 వి.ఘ 20 ఒక తృటికాలము చొప్పున మానములో కలియును. అట్టి 100 తృటికాలములు పూర్తియైతే లవములో చేరుచుండును. భాగవతమున చేల్దు లారగింపు ఘట్టమున బ్రహ్మ గోవత్సములను వత్సపాలకులను దాచి తిరిగి శ్రీకృష్ణ పరమాత్మకు అప్పగించుసరికి అయి

దాటు దినములు తక్కువగ నొక యేడాది యయినదనియు, నయ్యది బ్రహ్మకొక తృటికాలమైనదనియు భాగవతములలో కలదు. కాని 5,6, దినములు తక్కువ సంవత్సర మన్నప్పుడు బ్రహ్మమానము ప్రకారము రెండు తృటికాలములే యగును. ఒక తృటికాల మెంతమాత్రము కానేరదు. ఒక తృటికాదు రెండు తృటికాలములే యని స్వీయరచన దశమస్కంధ పూర్వభాగ ద్వితీయబిందువు 165 వ పద్యమున వివరించబడెను.

ఇప్పుడు సంకల్పము అద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేత వరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే అని చెప్పుచున్నారు. ఇప్పుడు వైవస్వతమనువున 28 వ మహాయుగము నడుచు
ష్టావింశతి కలియుగే ప్రథమ
పవునం దెన్నవ కలియుగమో
వున అద్య బ్రహ్మణః ద్వితీయ
వంతరే సంప్రతిఅష్టావింశతి కలి
ష్టావింశతి కలియుగే అని పుణ్యా
హ్మమానము ప్రకారము వర్త

“అష్టావిశంతి” అనుచోట
“సంప్రతి అష్టావింశతి తమే”
అని చేదువవలయును.

మానమున కెంతకాలమైనదనినచో పైన వివరించిన ప్రకారము గత ద్వాపరయుగాంతమునకు 197,29,44,000 లో గతించిన కలియుగ వత్సరములను వర్తమాన సంవత్సరము భుక్తిని చేర్చి పైని వివరించిన బ్రహ్మమానము ననుసరించి ఒక తృటికాలమునకు వె 5 ది 27 ఘ 46 విఘ 40 చొ॥ గణించినచో లబ్ధము వచ్చును.

శ్రీకృష్ణ పరమాత్మ జననమై యెన్నిదినములైనదని తెలిసికొన గోరినచో క్రీస్తు పూర్వము 3237-8-18 ది కావున 3237-3-18 దినములలో తెలిసికొన గోరినవాటికి హూణశకము గత సంవత్సరములును వర్తమాన సంవత్సరమున గడచిన నెలలు దినములు కలిపి యామొత్త

ములో 400 సంవత్సరములకు 1,46,097 దినములు చొప్పున నెన్ని నాలుగు వందలయితే యాసంఖ్యచే వెచ్చించి ఆదినములున్నూ, మిగిలిన సంవత్సరములకు 100 కి 36524 దినములు చొప్పున నెన్నివందలు అయితే అంతతో వెచ్చించి యా దినములున్నూ, మిగిలిన సంవత్సరము లకు 4 సంవత్సరములకు 1461 దినములు చొప్పున ఎన్నినాలుగులు అయితే అంతతో వెచ్చించి యాదినములున్నూ, మిగిలిన సంవత్సరము లకు 365 దినములు చొ॥ వెచ్చించి యాదినములున్నూ మిగిలిన నెలలకు నీదిగువ ఉదాహరించిన సూత్రము ప్రకారము అయిన దినములున్నూ కలిపిన ప్రతిఫలము వచ్చును.

గీ॥ జూను సెప్టెంబ రేప్రియల్ నవంబరు నకు ము
వాసిగ నవంబరునకు ము ప్పది దినాలు
ఫిబ్రవరి కిర్వదెన్మి దై పెఱనెలలకు
ముప్పదొక్కటి దినములు తప్ప వెపుడు॥

గీ॥ నాలుగేండ్లకు నొకతూరి కాలగలిని
లీపు సంవత్సరము వచ్చు నేపు మిగుల
నందునన్ ఫిబ్రవరి కొక టధిక దినము
గను గణించిన దినసంఖ్య క్రమత వచ్చు॥

గీ॥ నాల్గుచే శేషమగు హాయ నములరీతి
నాల్గుచే శేషమొందు వం దలునుగూడ
లీపు సంవత్సరములు కా లేవు కాన
పటుల గణియింప దినసంఖ్య యచ్ఛమగును

గీ॥ నాల్గువందల యేండ్లకు నాన్యాయముగను
తొంబదియు నేడు లీపులే తోఁచు, దాన
లక్ష నలువది యాఱువే ల్వరము నందు
తొంబదేడును జేర్చ ది నంబులలరు॥

నాల్గుచే భాగించగా శేషించని సంవత్సరములు లీపు లగును. శేషించిన వత్సరములు లీపులుకావు. ఆ సూత్రము ప్రకారము శతాబ్దములు కూడ నాల్గుచే భాగింపగా శేషించని శతాబ్దములు లీపు లగును. శేషించిన శతాబ్దములు లీపులు కావు. కావున నాలుగువందలు సంవత్సరములలో దొంబదియేడు లీపు సంవత్సరము లుండును.

365×400+97=1,46,097 దినములు నాలుగువందల సంవత్సరముల కుండును. ఇట్లు 365-97/400 దినములు ఒక సంవత్సరము. దీనినే సుమారు ఉరమరికగా 356 1/4 దినములు సంవత్సరమున కందురు. నికరముగా 356,97/400 అనునది హూణమానము ప్రకారముండును. కాని యయ్యాది సౌరమానము ప్రకారము సామాన్య వ్యత్యాసము కలదు. 365-97/400 అనగా ది 365-గ 5 ని 49 సె 12 లగును. లేదా ది 365 ఘ 14 విఘ 33 అగును. ఖగోళశాస్త్ర ప్రకారము సంవత్సరమనగా ది 365 గ 5 ని 48 లు లేదా ది 365 ఘ 14 విఘ 31 లిప్త 55 లగును. కావున ఖగోళశాస్త్ర నిర్ణయమునకు కేలండరునకు సంవత్సరమునకు 26 సెకండులు లేదా యొక విఘటిక యయిదులిప్తలు. వ్యత్యాసముండును. అట్లగుట 3323 2/13 సంవత్సరముల కొకదినము కేలండరు అధికముగా నడచును. కాబట్టి యట్టి 3323 2/13 సంవత్సరములకు కేలండ రొకదినము తగ్గించుకొనవలెను. నాలుగుచే భాగింపగా శేషింపని శతాబ్దములు లీపు సంవత్సరములని పైని తెలుపఁబడిన

సూత్రము ననుసరించి హూణశకము 3200 వ సంవత్సరము లీపు సంవత్సరమగును. కాని పైని వివరించిన విధముగ నొకదినము తగ్గించి సవరించుటకుగాను 3200 వ సంవత్సరము మాత్రము లీపు సంవత్సరము చేయకుండ ఫిబ్రవరి నెలకు 28 దినములే యగును. అట్లు సవరించినచో సౌర హూణమానములు సరిసమములుగ నుండును.

గీ॥ మూఁడువేల్రెండు వందల శ్రీ హూణులప్పుడు
వచ్చునప్పుడు లీపు సం వత్సరమును
లీపు నొనరింపకున్న చో నేఁడు మీఱ
సౌరమును హూణమును సరి సమములగును॥

సృష్టిలో భూతభవిష్యద్వర్తమానములలో నొక జాతకముబోలి యింకొక జాతక ముండదు. కావున నీ శ్రీకృష్ణ పరమాత్మ జాతకము వలె నింకొక జాతక ముండబోదు.



## * జాతకచక్రముల విమర్శ *

శ్రీకృష్ణ పరమాత్మ జాతకములు కొందఱు వ్రాసియున్నారు. వానికిని స్వీయరచన జాతకచక్ర జనన సంవత్సరాది విషయముల గురించియు గల యభిప్రాయముల నీ దిగువ వివరింతును.

1. శ్రీ వావిలకొలను సుబ్బారావుగారు (వాసుదాసు ఆంధ్ర వాల్మీకి మందరరామాయణ కృతికర్త) రచించిన శ్రీకృష్ణలీలా తరంగిణి లేక శ్రీకృష్ణ లీలామృతము అను గ్రంథమందు నీ దిగువ జూపఁబడిన చక్రము చూపిరి. దానిని దిననాథుఁడగు ఉజ్జయినీ జ్యోతిషుడు వ్రాసెనని పేర్కొనిరి.

| | | |
|---|---|---|
| ల | రా | గు |
| | | కు |
| ర చ / బు | శ కేతు | |

ఇందు రవిచంద్రులు సింహమున గలిసియున్నట్లు చూపిరి. బహుళాష్టమీ దినంబున రవిచంద్రులు కలిసియుండరు. ప్రతినెల బ౧రశి ౩౦ స్వ ౯ ౧ మీలలో నొకరాశిలో నుందురు. కావున బహుళాష్టమీదినంబున జన్మించిన యీ జాతకమునందు రవిచంద్రుల నొకరాశిలో

షుంచుట వలనుపడదు. ఇదిగాక శుక్రుని తులలోఁ జూపుటవలన స్వక్షేత్రవర్తి యగునని చూపియుండవచ్చును. శుక్రుడెన్నడును కృష్ణాష్టమీలకు తులకు వెళ్ళు సంచారము పరిశీలనలో లేదని పైని వివరింపఁబడియున్నది. రవితో గలిసియున్న చంద్రుని ఆనాటి స్థితియగు వృషభమునకు మార్చినచో సప్తగ్రహములకు నుచ్చ స్వక్షేత్రము లగును. ఎట్టి వానికైనను గ్రహముల కెట్టికి నుచ్చస్వక్షేత్రములు పట్టివని పైనుదాహరింపఁబడియున్నది. సప్తగ్రహములకు నుచ్చ స్వక్షేత్రములేర్పడు సంచారము గ్రహశాస్త్రము ననుసరించి పృథ్విలోనుండదు. కావునఁ బైచక్రమునుండి చంద్రుని వృషభమునకు జేర్చి యేదేని యొక గ్రహము నుచ్చనుండిగాని స్వక్షేత్రము నుండిగాని తొలగింపవలయునుగదా! తులకువెళ్ళు సంచారములేని శుక్రుని తులనుండి వెనుకకు మార్చవలెను. అట్లు స్వీయ రచన చక్రములో నున్నవిధముగ శుక్రుని సింహమునకు మార్చినచో సప్పుడీ చక్రమును స్వీయరచన చక్రమును సరిపడును. కాని యీ గ్రహకూటమి శ్రీ వాసుదాసుగారు వ్రాసిన విరోధి లేక విశ్వావసులలో జరుగుటకు నవకాశము కనిపించదు. స్వీయరచన చక్రమున వ్రాసిన విధముగ దుర్మతి సంవత్సరమునందే యేర్పడెను.

2. జాతక పారిజాతమునగల చక్రమందు సృష్ట్యాదివర్తమానాబ్దంబులు 195,58,79,864 అగు విజయ సంవత్సర శ్రావణ కృష్ణాష్టమీ మంగళవారమున నర్ధరాత్రి రోహిణీనక్షత్ర వృషభలగ్నమున శ్రీకృష్ణ పరమాత్మ జననము అని వ్రాసి యీదిగువఁ జూపిన చక్రము వ్రాసిరి.

195,58,79,864 విజయ సంవత్సరము కానేరదు. దుందుభి సంవత్సర మగును. దుందుభి సంవత్సరమైననే తప్ప కలియుగ ప్రారంభమగు ప్రమాది సంవత్సరము కానేరదు. విజయ సంవత్సరమే యైన యెడల గలియుగ ప్రారంభము విరోధికృతు అగును. కలియుగ

ప్రారంభము ప్రమాది సంవత్సరముగ కలియుగ ప్రారంభ గణితము సరిపడుచున్నది. కావున గలియుగ ప్రారంభము ప్రమాది సంవత్సర మనునది సిద్ధాంతము. 195,58,79,854. విజయ సంవత్సరమనునది యెంతమాత్రము కానేరదు. ఇదిగాక జాతకపారిజాతమున వ్రాసిన పై చక్రము గ్రంథములో జెప్పిన ఉచ్చలు లేవుసరికదా కళత్రకారకుడగు శుక్రునకును కళత్రస్థానాధిపతియగు కుజునకును నీచ. పుత్రస్థానమందు నీచగ్రహమును పుత్రస్థానాధిపతితో నీచగ్రహమును కూడినది గదా! కళత్ర కుటుంబ పుత్రస్థానములు నీచ సంపర్కము కలిగిన యెడల కృష్ణ నకు లీలామానుషత్వ మెట్లు వచ్చును? రవి శని కలయిక శుభ ప్రదముకాదు శ్రీకృష్ణ పరమాత్మ ప్రభావమునకు సరిపడినయోగములు గల చక్రము కానేరదు.

| | | |
|---|---|---|
| ల చ రా | గు | |
| శు బు | | |
| ర శ కు | | కే |

3. Notable Horoscopes ముఖ్యమైన జాతక చక్రములు.
Raman Publications Sri Rajeswari Banglore-20
ఈ పుస్తకములో 1వ నెంబరుగ శ్రీకృష్ణ జాతక చక్రము కలదు.

జీవన వివరములు.

కలిపూర్వము 125 వ సంవత్సరము శ్రీముఖ క్రీస్తు పూర్వము 3227 జూలై తే 19 దీ అర్ధరాత్రి సమయము, రోహిణీ నక్షత్ర తృతీయ చరణము వృషభలగ్నమని కలదు. అందు వ్రాయబడిన జాతకచక్ర మీ క్రింద చూపఁబడినది.

| | | |
|---|---|---|
| ల చ | | |
| శు కు రా | | కే |
| ర గు బు | | శ |

రవి 139-43 చంద్రుఁడు 47-42, జూలై తే 19 దీ అర్ధరాత్రి వినిగుణించి యీ దిగువ విమర్శ వ్రాయబడినది.

జూలై 19 తేదీకి రవి 139-48 డిగ్రీలకురాఁడు. ఆ తేదీకి 93, 94 డిగ్రీలలో నుండును. అనగ కర్కాటమున పునర్వసు అంతమున గాని పుష్యమినక్షత్రారంభమునగాని రవి యుండును. ఆ దినమునం దర్ధరాత్రి లేక అర్ధరాత్రివాటి యొక ఘడియ అకాలమున మేషలగ్నము అశ్వినీ నక్షత్రముగానుండును. అట్లగుట నాటి అర్ధరాత్రికి వృషభలగ్న రోహిణీ నక్షత్రము కానేరదు. రవి కర్కాటములో నున్నప్పుడు బుధుఁడు కన్యలో నుండడు. రవి కర్కాట కారంభమున నుండుటవలన బుధునకు గన్యా ప్రవేశ మైననుగలుగదు.

రవి 139-48 డిగ్రీలకు సెప్టెంబరు 5,6 తేదీలలో వచ్చును. ఆ రోజులలో నర్ధరాత్రి లేక యర్ధరాత్రిదాటి ఒక ఘడియలో మృగశిర ఉత్తరార్ధముతో గూడుకొనిన మిధునలగ్న మగును. ఆ దినములలో వృషభ లగ్నము గాని రోహిణీనక్షత్రముగాని యర్ధరాత్రి సమయమున నుండవు

అర్ధరాత్రి లేక అర్ధరాత్రిదాటి యొకఘడియలో జంద్రుఁడు 47-42 డిగ్రీలకు అనగా వృషభలగ్న ఆఱవనవాంశ రోహిణీనక్షత్ర తృతీయచరణము అగష్టు 19,20,21 తేదీలలో నుండును. కావున జూలై నెల 19 తేదీన రవి 139-48డిగ్రీలలో నుండుటయు ఆరోజున అర్ధరాత్రికిఁ జంద్రుఁడు 47-42 లో నుండి వృషభలగ్నము ఆఱవనవాంశ రోహిణీ నక్షత్రము తృతీయపాద మగుటయుఁ గానేరదు. అట్లగుట బుధుఁడు కన్యలో నుండఁడు.

నీచస్థుఁడైన కళత్రస్థానాదిపతితో కళత్రకారకుని గలుపుట శ్రీకృష్ణ పరమాత్మ జాతకమునకే భంగము. గురుని నస్తంగతము చేయుట ఉచ్చగ్రహములు లేకుండుట, కూడ నామహాత్ముని జాతకమునకు వర్తింపవు.

4 ఈ గ్రంథము వ్రాయదలఁచుకొన్నంతవ్రాసి ముద్రించుటకు సిద్ధముగా నున్న సమయమున అనగా నలనామ సంవత్సర గౌరీ పౌర్ణమీ దినమున నీ దిగువ నుదాహరించిన జాతక చక్రమొకటి తటస్థించినది. అయ్యాది పురాణాచార్య కాశీవిశ్వ విద్యాలయి పండిట్ బ్రహ్మశ్రీ రామమూర్తిశాస్త్రిగారిచే రచింపఁబడిన "శ్రీ మద్భాగవత కథ" అను భాగవత వ్యాఖ్యాన హిందీగ్రంథము. అందిట్లు కలదు.

"ఉచ్చస్థా, శశి, భౌమ, చంద్రతనయో లగ్నం వృషోలాభగే।
జీవ, స్సింహతులా వృషక్రమవశాత్పూషా, శనీ, రాహుకః"॥

అనికలదు. మఱియు నీ దిగువఁ జూపిన చక్రము కలదు. చక్రమునందు

స్వీయ రచనవలె, చంద్ర, కుజ, బుధ, శనులు ఉచ్చస్థులును గురుడు లాభస్థుడునునై యున్నారు. రాహువు వృషభమునఁ జూపిరి. బహుశా రాహువు వృషభమైనచో స్వీయరచన దుర్మతి సంవత్సరముకంటె నొక సంవత్సరము ముందుగా నుండును. అనగా కలిపూర్వము 139, క్రీస్తుపూర్వము 3240 ద్వాపరము 8,63,862, రౌద్రినామ సంవత్సరములో నేర్పడుటకు అవకాశముకలదు. కాని యీ పండితుఁడు జనన సంవత్సరము తెలుపలేదు. అయినను స్వీయరచన చక్రమునుబట్టి యొక సంవత్సరము ముందుగా గురుఁడు మీనారంభమున శని తుల మధ్యభాగమున రాహువు వృషభారంభమున నుండును. కాని శుక్రుఁడు తులాస్థితి మాత్రము కాకూడదు. శ్రీ కృష్ణాష్టమీలకు శుక్రుఁడు తులకు వచ్చు సంచార మెంత పరిశీలించినను లేదని పైని పలుచోట్లఁ దెలుపఁబడియున్నది. మఱియు శుక్రుని దులలో నుంచినచో సప్తగ్రహములు నుచ్చ స్వక్షేత్రములగును.

| | | |
|---|---|---|
| రా ల చం | | గు |
| | | కు |
| ర బు | శ శు | కే |

కావున నట్టుల నెట్టివారికిగాని సృష్టిలో నుండదనికూడ పైని పలుచోట్లఁ దెలుపఁబడియున్నది.

మొత్తము పైవి, చంద్ర, కుజ, బుధ, శనులు నుచ్చయనియు రవి, గురులు, స్వక్షేత్రమనియు, 1,4, జాతకములతో, స్వీయరచన జాతక మేకీభవించినందుకు హర్షముగనున్నది. 2,3, జాతకములతో స్వీయరచన జాతక మేకీభవించలేదు. రవి,చంద్రులు సర్వేసర్వత్ర యేకీభవించకతీరదు.

* శ్రీకృష్ణ పరమాత్మ-జననకాలము-జీవితకాలము నిర్ణయము. *

శ్రీకృష్ణ పరమాత్మ జననము (కలిపూర్వము 125 సంవత్సరముల నాటి శ్రీముఖనామసంవత్సరము క్రీస్తు పూర్వము 3227) అని కొన్ని యభిప్రాయములు కలవు. అదేకాకుండ నింకననేకులు ననేకవిధములుగ జనన సంవత్సరము వ్రాసియున్నారు. కావునఁ గలిపూర్వము నూట యిరువదైదేండ్లేయని యేకగ్రీవము లేదు. ఆయాయభిప్రాయములకు భిన్నముగ నీక్రింది యాధారములనుబట్టియు జాతకచక్ర సంఘటననుబట్టియు స్వీయాభిప్రాయము కలిపూర్వము 138 క్రీస్తు పూర్వము 3239 దుర్మతి నామసంవత్సర మని నిశ్చయించబడెను.

శ్రీమద్భాగవతైకాదశస్కంధషష్ఠాధ్యాయమున
"శ్రీకృష్ణం ప్రతి బ్రహ్మాది దేవోక్తిః"

శ్లో॥ యదువంశేఽవతీర్ణస్య భవతః పురుషోత్తమ।
శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికమ్ విభో ॥ 25

శ్లో॥ నాధునా తేఽఖిలాధార దేవకార్యావశేషితమ్।
కులం చ విప్రశాపేన నష్టప్రాయ మభూదిదమ్॥ 26

శ్లో॥ తతః స్వధామ పరమం విశస్వ యది మన్యసే।
స లోకాన్లోకపాలాన్నః పాహి వైకుంఠ కింకరాన్॥ 27

భగవానువాచ

శ్లో॥ అవధారిత మేతన్మే యదాత్థ విబుధేశ్వర।
కృతం వః కార్యమఖిలం భూమేః భారోఽవతారితః॥ 28

శ్లో॥ తదిదం యాదవకులం వీర్యశౌర్య శ్రియోద్ధతమ్।
లోకం జిఘృక్షద్రుద్ధం మే వేలయేవ మహార్ణవః॥ 29

శ్లో॥ యద్యసంహృత్య దృప్తానాం యదూనాం విపులం కులమ్।
గన్తాఽస్మ్యనేన లోకోఽయ ముద్వేలేన వినంక్ష్యతి॥ 30

శ్లో॥ ఇదానీం నాశ ఆరబ్ధః కులస్య ద్విజశాపతః
యాస్యామి భవనం బ్రహ్మ న్నేతదన్తే తవానఘ॥ 31

వీరరాఘవీయ వ్యాఖ్యా, యదువంశ ఇతి॥ హే పురుషోత్తమ ! హే విభో ! పంచవింశాధికం - శరచ్ఛతంవర్ష శతం-వ్యతీయాయవ్యతి క్రాంతమ భూతమ్॥

ఈ సందర్భమున పోతన భాగవతమున

గీ॥ అఖిలలోకేశ ! సర్వేశ ! యభవ ! నీవు
ఉదయమందుట భూభార ముడుపుకొఱకు
పంచవింశోత్తర శతాబ్ద పరిమితంబు
నయ్యెఁ; విచ్చేయు వైకుంఠ హర్మ్యమునకు॥ 85

మఱియు, "మాధవుల కన్యోన్య వైరానుబంధంబులు గల్గించి వారల హతంబు గావించి భూభారమడంచి యిదె వచ్చెద బొందు" అని 86వ, పద్యమున కలదు అటుపిమ్మట ద్వారకనుండి అందఱిని ప్రభాసతీర్థమున కంపుట, 87, 88, పద్యములలో గలదు. "ఇంక ద్వారకానగరంబు నేటికి సప్తమ దివసంబున సముద్రుండు ముంపగల

వాఁడు" అనియు, ఉద్ధవునకు బహుళమగు జ్ఞానోపదేశంబు చేయుట 91 నుండి 117 వరకు గలవు. భాగవత మూలమునను నీ వచనములు కలవు. ఈ సందర్భమున శ్రీ శఠఘంటం వెంకటరంగశాస్త్రి వచన భాగవతమున నీవు యదువంశమున నవతరించినాటగోలె నిప్పటికి నూట యిఱువదియైదేండ్లు గడచె నని కలదు.

విష్ణుపురాణము అంశము ౫ అధ్యాయము ౩౭

శ్రీకృష్ణం ప్రతి ఇంద్రప్రేషిత దేవదూతోక్తిః

శ్లో॥ వస్వశ్విమరుదాదిత్య రుద్రసాధ్యాదిభి స్సహ
విజ్ఞాపయతి శక్రస్త్వాం తదిదం శ్రూయతాం విభో! 17

శ్లో॥ భారావతరణార్థాయ వర్షాణా మధికం శతమ్
భగవానవతీర్ణోత్ర త్రిదశై స్సహచోదితః॥ 18

శ్లో॥ దుర్వృత్తా నిహతా దైత్యా భువో భారోఽవతారితః
త్వయా సనాథా స్త్రిదశా భవంతు త్రిదివే పునః॥ 19

శ్లో॥ తదతీతం జగన్నాథ వర్షాణా మధికం శతమ్।
ఇదానీం గమ్యతాం స్వర్గో భవతా యది రోచతే॥ 20

శ్లో॥ పంచవింశత్యుత్తరకం శతం తు శరదాం గతమ్।
ఇదానీం గమ్యతాం స్వర్గో భవతే యది రోచతే॥ 21

శ్రీ భగవాన్

శ్లో॥ యత్త్వమాత్థాఖిలం దూత వేద్మ్యేత దహమ ప్యత
ప్రారబ్ధ ఏవ హి మయా యాదవానాం పరిక్షయః॥ 22

శ్లో॥ భువో నాద్యాపి భారోయం యాదవై రనిబర్హితైః
అవతార్య కరోమ్యేత త్సప్తరాత్రేణ సత్వరః॥ 23

శ్లో॥ యథా గృహీతమంభోధే ర్దత్వాహం ద్వారకాభువమ్
యాదవా నుపసంహృత్య యాస్యామి త్రిదశాలయమ్॥ 24

శ్లో॥ మనుష్యదేహ ముత్సృజ్య సంకర్షణ సహాయవాన్
ప్రాప్తఏవాస్మి మంతవ్యో దేవేంద్రేణ తథామరైః॥ 25

శ్లో॥ జరాసంధాదయో యేన్యే నిహతా భారహేతవః।
క్షితే స్తేభ్యస్తు బాలోపి యదూనాం నాపచీయతే॥ 26

శ్లో॥ తదేతం సు మహాభార మవతార్య క్షితేరహమ్।
యాస్యామ్యమరలోకస్య పాలనాయ బ్రవీహి తాన్॥ 27

అని కలదు. ఈ గ్రంథములలోను "నూటయిరువది యయిదేండ్లు గడచెను. ఇక తిరిగి యథాస్థానమగు స్వర్గమునకు రావలసినదిగా దేవతలు ప్రార్థించిరి" అని కలదు. వ్యాఖ్యాతలుకూడ నూటయిరువది యైదేండ్లు దాటినవిగనుక స్వర్గమునకు రావలసినదిగా గోరినట్లు వ్రాయుచు దాని నాధారముగా శ్రీకృష్ణ పరమాత్మ జీవితము కలి పూర్వము 125 యేండ్లనాటి శ్రీముఖ సంవత్సరమని వ్రాసిరి. 125 యేండ్లుదాటినప్పటికి స్వర్గమునకు జేరమిచేతనే దేవతలు వచ్చి కోరిరి.

మానవుడు భూలోకములో నుండదగిన యత్యధిక పరమాయు ప్రమాణము 125 యేండ్లందురు. కావున నవిదాటినవని తిరిగిరమ్మని పిలిచిన దానిని 125 యేండ్లే అయుర్దాయముగ వ్యాఖ్యానించుట నిర్దిష్టమైన విషయముగ గనిపించదు. దేవతలు పిలువవచ్చి 125 యేండ్లు దాటిపోయిన వనుటలో 125 యేండ్లు దాటి యెన్నాళ్ళైనదో? అటుతరువాత "యాదవుల కన్యోన్య వైరానుబంధములు గల్పించి భూభార మడంచి వచ్చెద" నని దేవతలకుఁజెప్పి పంపివేసిన యాపని నిర్వర్తించుటకు గొంతకాలము పట్టును. వారిని బంపివేసిన వెంటనే నెరవేరిపోవలసినపని కాదుకదా! అది యెంతకాలము పట్టునోకదా! ఉద్ధవునకు బహుళమగు ధర్మ జ్ఞానోపదేశములు చేయుటకు గొంతకాలము పట్టునుగదా! పిలుచునప్పటికే 125 యేండ్లు దాటెనని రిగదా! 125 యేండ్లుదాటి యెన్నాళ్ళయ్యెనోకదా!

ఇవన్నీ యిట్లుండ స్వర్గమునకు తిరిగి ప్రయాణము చేయునప్పుడు పిలువగానే పిలిచిన పుష్పక విమానము మీదనే వెళ్ళిపోయెనా ? లేదు ఎట్లు వెళ్ళును ? సర్వసన్నద్ధము చేసికొనుటకు గొంతవ్యవధి కావలయును గదా ! ఇవన్నియు నాలోచింపగా గొన్ని మాసములలో 125 యేండ్లని స్థిరపడుటకు వలనుపడదు. మఱియు 125 యేండదనాడు గ్రంథములలోఁ జెప్పినవిధముగ గ్రహకూటమి యుండవలెనుగదా ! అట్టి గ్రహకూటము స్వీయరచనలో వివరించిన ప్రకారము కలిపూర్వము 138 యేండ్లు దుర్మతియే యైయున్నది. ఆదినమునే గ్రంథములలో వివరించిన ప్రకారము గ్రహములు తారలు శుభ, సౌమ్యములై గ్రహములు ఉచ్చస్థితి గలవై యుండెన జేర్పడినవి. దేవతలని సరిగా 125 యేండ్లు దాటి యే శ్రావణ బహుళాష్టమి దినంబున నక్షత్రపడెనో యా యేడు జనన మనునది నిశ్చయము. అట్లేర్పడినదే దుర్మతి సంవత్సరము. అది నిస్సంశయము. 175 యేండ్లకు 138 యేండ్లకు వ్యత్యాసము 13 సం॥ రములే. అవి దేవతలకుఁ బదమూఁడు దినములే గదా !

మఱియు జగత్సృష్టి మొదలుకొని జరిగెడి యిరువదెనిమిదవ మహాయుగమునందుఁ దటస్థించునట్టి ద్వాపరయుగమున నియ్యది జరుగునని ముచికుందోక్తిగా వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. ఇది జగత్సృష్టి మొదలుకొని యిరువదెనిమిదవ మహాయుగము కాదు. వైవస్వతమనువున నిరువదెన్మిదవ మహాయుగము. ముచికుందోక్తిలో జగత్సృష్టి మొదలుకొని యనిలేదు.

శ్లో॥ "పురా గర్గేణ కథిత మష్టావింశ త్తమే యుగే
ద్వాపరాంతే హరేర్జన్మ యదువంశే భవిష్యతి"॥

అనియున్నది. శ్రీకృష్ణుడు జన్మించిన ద్వాపరయుగము వైవస్వతమనువు యొక్క పరిపాలనలో నిరువదెనిమిదవ మహాయుగమై

యున్నది. ప్రతిమనువు 71 మహాయుగములు పాలించును. అట్టిమనువు లార్వురును మనుష్యులు లేకను గడచెను. ఈ కల్పమున నెన్ని మహాయుగములైనవో యెన్ని సంవత్సరములైనవో సృష్ట్యాదినుండి యెంతకాలమైనదో వెనుక వ్రాయబడిన పత్రములలో వివరింపబడి యున్నది.

ఈపైని వివరింపబడిన కారణములనుబట్టి యీ జాతకచక్రము కలిపూర్వము 1 [illegible] దుర్మతి సంవత్సరముగ భ్రమపడి వ్రాసిన నా సాహసమునకు క్షమించి పండితులు శాస్త్రజ్ఞులు పౌరాణికులు జ్యోతిషులు ఖగోళశాస్త్రజ్ఞులు, సంగీతకర్తలు రసజ్ఞులు విమర్శకులు పాఠకులు భక్తులు ప్రభుత్వము మొదలగు సర్వులు తమ తమ యామోదముద్రలు వంపెదరని యాశించుచున్నాను. మంగళమ్ మహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

గద్య :- ఇయ్యది శ్రీ రమారమణ కరుణా కటాక్షంబున
భగవద్భక్తి పరాయణుండును వైశ్యకులోద్భవుండును
దేవకుల గోత్రీయ టంకాల వంశ్య అన్నపూర్ణా
ప్పన్నాఖ్య సుదంపతుల ద్వితీయ సుపుత్త్రుం
డును శ్రీమద్భాగవత సారామృత సీసకావ్య
రచయితయును నగు సత్యనారాయణ
నామధేయునిచే రచింపబడిన
శ్రీకృష్ణ పరమాత్మ జాతకము.
సమాప్తము.
ఓం తత్ సత్

# కృష్ణాష్టకమ్

శ్రియాశ్లిష్టో విష్ణుః స్థిరచరగురు ర్వేదవిషయో
ధియాం సాక్షీ శుద్ధో హరి రసురహన్తా బ్జనయనః
గదీ శంఖీ చక్రీ విమలవనమాలీ స్థిరరుచిః
శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః ॥

యత స్సర్వం జాతం వియ దనిల ముఖ్యం జగదిదం
స్థితౌ నిశ్శేషం యోఽవతి నిజసుఖాంశేన మధుహా
లయే సర్వం స్వస్మిన్హరతి కలయా యస్తు స విభుః
శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః ॥

అసూనాయమ్యాదౌ యమనియమముఖ్యైః సుకరణై
ర్నిరుధ్యేదం చిత్తం హృది విలయ మానీయ సకలమ్
యమీడ్యం పశ్యన్తి ప్రవరమతయో మాయిన మసౌ
శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః ॥

పృథివ్యాం తిష్ఠన్యో యమయతి మహీం వేద న ధరా
య మిత్యాదౌ వేదో వదతి జగతా మీశ మమలమ్
నియన్తారం ధ్యేయం మునిసురనృణాం మోక్షదమసౌ
శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః ॥

మహేన్ద్రాది ర్దేవో జయతి దితిజా న్యస్య బలతో
న కస్య స్వాతంత్ర్యం క్వచిదపి కృతౌ యత్కృతిమృతే
బలారాతే ర్గర్వం పరిహరతి యోఽసౌ విజయినః
శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః॥

వినా యస్య ధ్యానం వ్రజతి పశుతాం సూకరముఖాం
వినా యస్య జ్ఞానం జనిమృతిభయం యాతి జనతా
వినా యస్య స్మృత్యా కృమిశతజనిం యాతి స విభుః
శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః॥

నరాతంకోట్టంకః శరణశరణో భ్రాంతిహరణో
ఘనశ్యామో వామో వ్రజశిశువయస్యోఽర్జునసఖః
స్వయంభూ ర్భూతానాం జనక ఉచితాచారసుఖదః
శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః॥

యదా ధర్మగ్లాని ర్భవతి జగతాం క్షోభకరణీ
తదా లోకస్వామీ ప్రకటితవపుః సేతుధృ దజః
సతాం ధాతా స్వచ్ఛో నిగమగణగీతో వ్రజపతిః
శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః॥

ఇతి శ్రీమచ్ఛంకరభగవత్పాద కృతం కృష్ణాష్టకం
సంపూర్ణమ్.

# నవగ్రహస్తోత్రము

శ్లో॥ జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిం।
తమోఽరిం సర్వపాపఘ్నం ప్రణతోఽస్మి దివాకరమ్॥ (రవి)

శ్లో॥ దధిశంఖ తుషారాభం క్షీరార్ణవ సముద్భవం।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్॥ (చం)

శ్లో॥ ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభం।
కుమారం శక్తి హస్తం తం మంగళం ప్రణమామ్యహమ్॥ (కుజ)

శ్లో॥ ప్రియంగు కలికాశ్యామం రూపేణాప్రతిమం బుధం।
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్॥ (బుధ)

శ్లో॥ దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభం।
బుద్ధిభూతం త్రిలోకేశం తన్నమామి బృహస్పతిమ్॥ (గురు)

శ్లో॥ హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుం।
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్॥ (శుక్ర)

శ్లో॥ నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం।
ఛాయామార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్॥ (శని)

శ్లో॥ అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్య విమర్దనం।
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్। (రాహు)

శ్లో॥ పలాశపుష్ప సంకాశం తారకాగ్రహ మస్తకం।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్॥ (కేతు)

శ్లో॥ ఇతివ్యాస ముఖోద్గీతం యః పఠేత్సుసమాహితః।
దివావా యదివా రాత్రౌ విఘ్నశాంతి ర్భవిష్యతి॥

శ్లో॥ నరనారీనృపాణాంచ భవే ద్దుస్స్వప్న నాశనం।
ఐశ్వర్యమతులం తేషా మారోగ్యం పుష్టివర్ధనమ్॥

శ్లో॥ గ్రహనక్షత్ర జాః, పీడా స్తస్కరాగ్ని సముద్భవాః
తాః సర్వాః ప్రశమం యాంతి వ్యాసో బ్రూతే న సంశయః॥

ఇతి శ్రీ వ్యాసవిరచిత నవగ్రహస్తోత్రం సంపూర్ణం.